# హద్దుమీరెడి పశువుల చట్టము

# (The Cattle Tresspass Act)

## I of 1871

మరియు

## మద్రాసు పశువ్యాధుల చట్టము

(1866 సం॥ 2 వ చట్టము)

1959 సం॥ XVI వ చట్టముచే పై కేంద్ర చట్టమును
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, సవరణచేసి ఆంధ్రప్రదేశ్
రాష్ట్రమునకు విస్తరించి వర్తింప
చేయబడెను


గ్రంథకర్త :

జె. వి. కృష్ణశర్మ, బి. యస్. సి., బి. యల్.

హైకోర్టు అడ్వకేట్, హైదరాబాదు (ఆ. ప్ర.)



ప్రకాశకులు :

జయభారత్ బుక్ డిపో.,

సుల్తాన్ బజారు హైదరాబాదు

కె. వి. రంగారెడ్డి
(రివెన్యూ మంత్రి)
(ఉప ముఖ్యమంత్రి)

బేగం పేట
20-10-1960

శ్రీ జే. వి. కృష్ణశర్మ, బి. యస్. సి., బి. యల్; అడ్వొకేటుగారు, మద్రాసు, తెలంగాణా హద్దు మీరెడి పశువుల చట్టములను (The Cattle Tresspass Acts) సమన్వయ పరిచి ఆంధ్ర ప్రదేశమున వర్తింప జేసిన చటమును, దానికి సంబంధించిన నియమాలను మరియు మద్రాసు పశువ్యాధుల (నివారణ) చట్టమును తెనుగులో అనువదించిన పుస్తకమును నేను చదివినాను. చక్కని తెలుగు భాషలో అనువదించడమే గాక ప్రతి అధ్యాయములోని విషయములను క్లుప్తముగా వ్రాసియున్నారు.



ఈ చట్టములు సామాన్యముగా గ్రామ పజలకు యెక్కువ అవసరము. వారు ఈ చట్టములను సంపూర్ణముగా అర్థము చేసికొనవలసి యుంటుంది. వీటిని తెనుగించుట వల్ల గ్రామీణ ప్రజలకు యెంతయో ఉపయోగకరంగా యున్నది. దీనివల్ల వారు చట్టములను అర్థం చేసుకొని తమ బాధ్యతలను చక్కగా నెరవేర్చె అవకాశము వారికి లభించినది.

శ్రీ జె. వి. కృష్ణ శర్మ, అడ్వొకేటు గారి కృషి ప్రశంసనీయము.

(సం.) కె. వి. రంగారెడ్డి

# తొలిపలుకు

ఈ చిన్నపుస్తకము ప్రకాశకుల కోరిక ననుసరించి వ్రాయుట అయినది. ప్రకాశకులు వీలు అయినంతవరకు, ఆంగ్లములో నున్న చట్టములు అన్నియూ తెలుగులో ప్రచురింపవలయు ననెడి దృఢసంకల్పులు. దీనికి కారణము ముఖ్యముగా ఏమనగా, ఆంగ్లమున నుండిన చట్టములచే పాలింపబడుచూ దాని సారాంశము కూడా స్వయంగా చదువుకొనుటకు వీలుగాని పరిస్థితులలో నుండుటయే. ప్రతి చిన్న విషయమునకు ఇంకొకరి మీద ఆధారపడుట కష్టము గదా ! ముఖ్యముగా తెలంగాణా జిల్లాలలో ఈ కష్టము ప్రత్యక్షము. దీనిని తీర్చుటయే వీరి యుద్దేశ్యము. అది ఎంతయో అభినందించవలసిన విషయము.

ఈ పుస్తకములో కేంద్ర చట్టమునకు, అవసరమైన చోట్ల, ఆంధ్రప్రదేశ్ చట్టముచే, చేయబడిన సవరణలు చేర్చబడి, ఆంధ్రప్రదేశ్ చే, చేయబడిన చట్టము. విడిగా కూడా ఈయబడెను. ఈపుస్తక రచనలో భావము పోకుండా, మక్కికి మక్కిగా అనువదించకుండా, ఎవరి కొరకై ఈ పుస్తకం వుద్దేశింపబడినదో, వారిని దృష్టిలో నుంచుకొని, గ్రామ్యములకు భాషాశైలికి ప్రత్యేక స్థానము కల్పింపక వ్రాయుట అయినది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము 32 వ సెక్షన్ అనుసరించి నియమావళి ఇంకా చేయని కారణమున, పూర్వము అక్కౌంటు కోడు (4 వ భాగము) లోని నియావళిని పురస్కరించుకొని, దానిలో ఆంధ్ర రాష్ట్రమునకు సంబంధించని నియమములను తొలగించడము అయినది. ఇది పాఠకులు గ్రహింతురుగాక ! దీనిలోనే హాస్పిటలు, బందిలిదొడ్ల చట్టము క్రింద చేయబడిన నియమావళి కూడా చేర్చబడెను. దీనికి కారణము, చట్టములు రెండింటికి, యుండెడి అవినాభావ సంబంధమే. ఈ చిన్న పుస్తకము. గ్రామీణ ప్రజలు, ఇతరులు చదివి, చట్టము, దాని నిర్వహణపద్ధతి సులభముగా అర్థము చేసుకొనగలిగిన నేను కృతకృత్యుడను.

ఇట్లు

జమ్మలమడక వేంకట కృష్ణశర్మ

# విషయ సూచిక



## మొదటి భాగము

## 1వ అధ్యాయము

### ఆరంభము



## 2వ అధ్యాయము

### పశుదొడ్లు మరియు పశుదొడ్ల కాపర్లు.



### పశుదొడ్ల కాపరుల విధులు

## 3వ అధ్యాయము

### పశువులను బందిలీ చేయుటకు పట్టుకొనుట :



### చట్టముయొక్క విషయము :



## 4వ అధ్యాయము

### పశువులను విడుదల చేయుట లేక అమ్మకము :

## చట్టముయొక్క విషయము :



# 5వ అధ్యాయము

## అన్యాయముగా పట్టుకొనుటను గురించి గాని కట్టి వేయుట గురించిగాని ఫిర్యాదులు :

## 6వ అధ్యాయము

### అపరాధములు :



## 7వ అధ్యాయము

### నష్టపరిహారమునకు దావాలు :



## 8వ అధ్యాయము

### అనుబంధము :

# రెండవ భాగము

## వి వ ర ము లు

# నియమావళి

## మూడవ భాగము

నిబంధన నెం. పేజీ నెం.

(ఏ) హద్దుమీరెడి పశువుల చట్టము (1871 సం॥ 1వ చట్టము) యొక్క నిబంధనల క్రింద చేయబడిన నియమావళి

నిబంధన నెం. పేజీ నెం

## (డి) పశుదొడ్ల కాపర్ల అకౌంట్లు

# చట్టపూర్వ చరిత్ర

హద్దుమీరెడి పశువులకు సంబంధించిన చట్టమును మార్పుచేసి, క్రోడీకరించుట అవసరమని తోచుటచే కేంద్ర ప్రభుత్వముచే 1871వ సంవత్సరములో ఈ క్రింది విధముగా చట్టరూపములో ఇది చేయ బడినది. అప్పటిలో ప్రస్తుత తెలంగాణా జిల్లాలు (ఆంధ్రప్రదేశములోని) పార్టు (బి) స్టేటు ప్రభుత్వమువారి అధీనములో వుండుటచేతను స్వతంత్ర రాజుల చేతులలో నుండుటచేతను ఈ చట్టము ఆ ప్రాంతములకు అనువర్తింపబడలేదు. కాని ఆ ప్రాంతములకు 1337వ ఫసలీ 5వ చట్టము క్రింద షుమారు ఇదే నిబంధనలతో యింకొక చట్టము వ్యవహారములో యుండెను. ఆంధ్రప్రదేశములోని ఇప్పుడు ఆంధ్ర జిల్లాలు అప్పటి మదరాసు రాష్ట్రములో చేరియుండుటచేతను ఇప్పుడు మదరాసు రాష్ట్రము తిరిగి ఆరాష్ట్రమున కనుగుణ్యముగా ఈకేంద్ర చట్టమునకు సవరణచేయు టచేతను భాషారాష్ట్ర విభజన అయిన పిమ్మట ఆంధ్రప్రదేశములోని చట్ట ములన్నియు సరిచూసి తెలంగాణా జిల్లాలలోనూ ఆంధ్రజిల్లాలలోను అమ లులోయున్న చట్టములను సమన్వయపరచి ఏకైక చట్టముగా చేయుటయే ఈ 1959వ 16 వ చట్టముయొక్క ముఖ్యోద్దేశము. ఈ చట్టము, కేంద్ర చట్టమును, ఆంధ్ర రాష్ట్రమునకు అనుగుణ్యముగా సవరణలు చేసినది. ఈ సవరణ చట్టము 1958 జనవరి 30వ తేది రోజున ఆంధ్రప్రదేశ్ గవర్నరుగారి సమ్మతిపొంది, 1959 ఫిబ్రవరి 12వ తారీఖున ఆంధ్రప్రదేశ్ గెజట IV (బి) భాగములో 11 పుటయందు ప్రచరింపబడెను, ఈ సవరణ చట్టము ద్వారా తెలంగాణా జిల్లాలలో, ఈ కేంద్ర చట్టము యొక్క మొదటి అధ్యాయము వెంటనే అమలులోకి తేబడెను, మిగతానిబంధనలు ప్రభుత్వము ప్రకటించిన తేదినుండి అమలులోకి వచ్చును. ఈ చట్టము అమలులోకి వచ్చిన తేదీ నుండి 1337 వ ఫసలీ 5వ చట్టము రద్దు చేయ

బడెను. ఇట్లు సమన్వయించుటలో ఆ చట్టము క్రింద చట్ట కార్యములను నిర్వహించు అధికార్లుకూడా పోలీసు అధికారి, నిర్వచనములలో పేర్కొన బడెను.

పూర్వము స్వంత దొడ్లలో గ్రామములలోని పశువులను బందిలీ చేయుట అలవాటుగా యుండెడిది. దీనివలన గ్రామములలో అలజడులు కలిగి సక్రమమైన విధముగా పశువులను యజమానులకు అప్ప జెప్పుట కష్టముగా యుండెడిది. అందుచేత ప్రభుత్వమువారు వారి అజమాయిషి క్రిందనే ప్రతి గ్రామములోను బందిలీదొడ్లను ఏర్పాటు చేసి అది పోలీసులు, రివెన్యూ అధికార్ల పర్యవేక్షణ క్రింద వుంచబడెను. దీని మూలమున గ్రామములో శాంతిభద్రతలు ఏర్పడగలవని విశ్వశింప బడుచున్నది. బందిలీదొడ్డి కాపర్లకు నియామకములో ఎక్కువ కష్టము లేదు, కాని వారికిచ్చు జీతము ఇతర ఖర్చులు ప్రస్తుత పరిస్థితులనుబట్టి చాల తక్కువగా యున్నవి. దీనివలన అనేకమైన అక్రమ పద్ధతులకు అలవాటు పడుటకు అవకాశముగలదు. ఈ చట్టము 1871లో చేసినపుడు అప్పటి పరిస్థితులనుబట్టి బందిలీదొడ్ల కాపర్లకిచ్చు జీతములు సక్రమమని తోచినను ప్రస్తుత పరిస్థితులనుబట్టి వారి భత్యములు తిరిగి నిర్ణయింప బడుట చాలా అవసరము. వారలు నిర్వహించవలసిన విధులుకూడా ఎక్కువ బాధ్యతతో కూడినవి.

---

# చట్ట సంగ్రహము

## 1వ అధ్యాయము

ఈ చట్టము 1956వ సంవత్సరము నవంబరు 1 వ తేదీముందు పార్టు (బి) రాష్ట్రములలోతప్ప అనగా భాషా విభాగ చట్టము యొక్క 3వ నిబంధన యొక్క 1వ ఉపనిబంధనలో పేర్కొనబడిన ప్రదేశములు తప్ప మరియు హైదరాబాదు, సికిందరాబాదు నగరములు తప్ప, మరియు ప్రభుత్వమువారు ఏదైనా స్థానిక ప్రదేశములు మినహాయించిన అవియు, రాజధాని పట్టణములకువర్తించదు. వేటివేటికి వర్తించదో తడవతడవకు ప్రభుత్వమువారు గెజెట్ ద్వారా ప్రకటన చేయుదురు. దీనిలోకొన్ని నిబంధనలు ప్రభుత్వమువారు 1914వ సంవత్సరములో 10వ చట్టము ప్రకారము తొలగించడమైనది, ఏ ఏ నిబంధనలు తొలగించబడినవి చట్టములో పేర్కొనబడినవి, పూర్వపు తెలంగాణా జిల్లాలు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములో కలుపబడినవాటికి ఆంధ్రప్రదేశ్ చట్టముద్వారా సవరించబడినది. నిర్వచనములలో పోలీసు అధికారి అనగా ఆంధ్రప్రదేశ్ సవరణచట్టము ద్వారా గ్రామతలారి, పోలీసు పటేలు, లేదా ఆయన బాధ్యతలు నిర్వహించు మరియొక వ్యక్తికూడా చేర్చబడిరి. ఈ పైన చెప్పిన అధికార్లు తెలంగాణా జిల్లాలలో పూర్వము ఇంతవరకు ఈ కార్యములునిర్వహించుచుండిరి కాబట్టి సమన్వయించుటలో వీరినికూడా చేర్చడమైనది.

---

## 2వ అధ్యాయము

ఈ అధ్యాయములో ప్రత్యేకముగా బందిలీదొడ్లును గురించి బందిలీదొడ్లకాపర్లు గురించి, చెప్పబడినవి, అనగా, బందిలీదొడ్ల నేర్పాటు

చేయుట, వాటిమీద అజమాయిషీ, బందిలీ చేయబడిన పశువులకు మేత ఖర్చుకు విధించవలసినచార్జీలు, బందిలీదొడ్ల కాపర్ల నియామకము, వారి హోదా వారుచేయవలసినవిధులు పేర్కొనబడినవి. సాధారణముగా బందిలీ దొడ్లు జిల్లా మేజిస్ట్రేటుచేత నిర్ణయింపబడినచోట్ల ఏర్పాటు చేయబడును. ప్రభుత్వమునకు ఈయన నిర్ణయము ప్రభుత్వాజమాయిషీకి లోబడి యుండును. బందిలీదొడ్లకు సాధారణముగా ఆగ్రామముపేరు బందిలీదొడ్డి అనే పిలవబడును. వీటియొక్క నిర్వహణ అంతయు సర్వసాధారణ ముగా జిల్లామేజిస్ట్రేటుకే యుండును. వీటిలో బందిలీ చేయబడిన పశువులకు విధించవలసిన జుల్మానాలు, మేత మొదలగు ఖర్చులయొక్క రేట్లు, ఆయనచేతనే తడవతడవకు మార్పుచేయబడి నిర్ణయింపబడును. బందిలీదొడ్డి అధికారి రాష్ట్రప్రభుత్వముచేత నిర్ణయింపబడును. అనగా ఈ చట్టము కేంద్రచట్టముకాబట్టి బందిలిదొడ్డి కాపర్ల నియామకములో వారి కెట్టి బాధ్యతలేదు. రాష్ట్రప్రభుత్వమువారికి వుండెడి అధికారముక్రింద ఈ బాధ్యత జిల్లా మేజిస్ట్రేటుకి బదిలీచేయబడెను. బందిలీదొడ్డి కాపరి ప్రభుత్వయితర ఉద్యోగస్థుడై యుండికూడా ఈ ఉద్యోగిగా నియమించ బడవచ్చును. ఈయన విధి నిర్వహణలో అతని అధికారములు బాధ్యతలు గమనించి అతనిని శిక్షాస్మృతి క్రింద "ప్రభుత్వ వుద్యోగిగా" పరిగణించబడును, ఇతను నిర్వహించవలసిన బాధ్యతలు అనేకము కలవు. అవి ముఖ్యముగా 7, 8, 12, 13, 14, 15, 16, 17, 18, 19, 27వ నిబంధనలలో చెప్పబడెను. ఇవికాక ఇతర బాధ్యతలు అనగా వీటి నిర్వహణలో (1) అవసరమయ్యెడి పుస్తకములను వ్రాయుట, హాజరు పెట్టుట, (2) లెఖ్ఖలు తయారుచేసి పంపుట, (3) పైవుద్యోగస్థులు తనిఖీకివచ్చినప్పుడు హాజరుగాయుండుట, (4)బందిలీదొడ్లను శుభ్రముగా యుండునట్లుచూచుట, దానిలోని ఫలవృక్షములు ఫలసాయముఇచ్చు ఇతర చెట్లు, ఎరువులు మొదలగునవి నియమావళిప్రకారము సరిగా వినియోగ పడునట్లు చూచుట, (5) ముఖ్యముగా పశువులకు మేత, నీరు, సక్రమ ముగా పెట్టుచుండుట, (6) వాటికి రోగములువచ్చిన, వాటికొరకు నిర్ణ యింపబడిన బందిలీదొడ్లకు పంపుట, (7) బందిలీదొడ్డిలో చనిపోయెడి

పశువులగురించి వెంటనే అధికారులకు తెలియపరుచుట, (8) వాటిని ఖననముచేయుట, (9) తన క్రింది పనివారలచేత సక్రమముగా పని చేయించుకొని వారలకు నిర్ణయించబడిన విధానముగా జీతములుగాని, బత్తెములుగాని, ప్రతిఫలముగాని పంచిపెట్టుట, (10)వీటికి సంబంధించిన లెఖ్ఖలన్నియు నిర్ణీతమైన పుస్తకములలో వ్రాయుట, (11) అన్ని రకములైన రశీదులిచ్చుట, (12) నెలసరిలెఖ్ఖలు తయారుచేసి తహసిల్దారు ఆఫీసుకి పంపించుట మొదలగు బాధ్యతలు కలవు. అన్నింటికన్నా ముఖ్యమైన బాధ్యత ఏమనగా, ఇతను బందిలీచేయబడి వేలమునకు తేబడిన ఏ పశువైనను లోపాయికారీగా కొనకూడదు. ఇతని కార్య నిర్వహణలో ఎట్టిలోపము వచ్చినను అదినేరముగా పరిగణింపబడి మేజిస్ట్రేటుచేత శిక్ష విధింపబడగలదు. అదికాక అదనముగా 50 రూపాయలవరకు జుల్మానా విధింపబడగలదు.

---

## 3వ అధ్యాయము

ఈ అధ్యాయములో ఎట్టి పశువులను ఎవరి సహాయముతో ఏ సందర్భములయందు బందిలీ చేయబడవలెనో చెప్పబడియున్నది. దీనిలో ఏ పశువైనను, ఏ పంటభూమియందైనను హద్దుమీరి తిరుగాడుచు అట్టి భూములకుగాని, పంటలకుగాని నష్టము కలిగించుచున్నయెడల అవి బందిలీ చేయబడవచ్చును. ఆ విధముగా వాటిని పట్టుకొనుటలో పోలీసు అధికారులందరు వారికి సహాయము చేయవలెను. ఇవికాక ప్రభుత్వమునకు ప్రజలకు సంబంధించిన స్థలములు, రహదార్లు, కాలవగట్లు, కరకట్టలమీదకూడా తిరుగాడుచున్నవుడు అవి బందిలీ చేయబడవచ్చును. ఈ విధముగా బందిలీచేయబడిన పశువులకు జుల్మానాలు విధించబడును. ఏ రకమైన పశువులకు ఎంతెంత జుల్మానా విధించబడవలెనో ప్రభుత్వము వారు ఈ చట్ట కార్యనిర్వహణకొరకు తయారుచేసిన నియమావళిలో తెలియపరచబడెను. ఈ రేట్లను మార్చుటకు ప్రభుత్వము వారికి

ఎప్పుడును అధికారము వుండును. ఈ విధముగా వసూలుచేసిన జుల్మా నాలు పశుదొడ్ల కాపరిచేత తాలూకా ఆఫీసులో జమకట్టబడి జిల్లామేజి స్ట్రేటుకి లెఖపంపబడును. అదే విధముగా ఏ ఏ పశువుకి రోజుకి ఎంతెంత జుల్మానా విధించవలెనో మరియు రోజుకి మేత ఖర్చుకు ఎంతెంత వసూలు చేయబడ వలెనోకూడ ప్రభుత్వము వారిచేత నిర్ణయింపబడిన జాబితా అట్టి పశువుల దొడ్లవద్దనే ప్రకటించబడును.

---

## 4వ అధ్యాయము

ఈ అధ్యాయములో బందిలీ చేయబడిన తరువాత పశువులను ఏ పరిస్థితులలో వదలబడవలెనో లేక అమ్మబడవలెనో వివరింపబడినది. ప్రభుత్వముయొక్క వుద్దేశ్యము ఈ చట్టము అమలు జరుపుటలో ఏమ నగా, పశువులు వాటి యజమానులకు సంబంధించని ఇతరుల యొక్క గాని ప్రభుత్వము యొక్కగాని పంటలకు ఆస్థులకు నష్టము కలుగకుండా చూచుటకును నిర్ణీత స్థలములలో విచ్చలవిడిగా తిరుగకుండా కట్టుదిట్టము చేయుట అని తెలియుచున్నది. దీనికి తార్కాణము ఏమనగా బందిలీ చేయబడిన పశువులకు విధించబడే ఖర్చులుగాని, జుల్మానాలుగాని చాలా తక్కువగా యుండుటయే. ఈ చట్టము మూలముగా ప్రభుత్వము ఆదా యము పెంచుకొను వుద్దేశ్యము కనిపించదు. దీనికి తార్కాణము తరు వాత అధ్యాయములో చెప్పబడినట్లు ప్రతి బందిలీదొడ్డి నుండి రాబడి ఆ బందిలీదొడ్డి నిర్వహణకయే ఖర్చులకు వినియోగించ బడుచుండును. పై పెచ్చు ఎట్టి సందర్భములలోనైనను ఏదైనా పశువులదొడ్డి నుండి రాబడి సరిపోవనప్పుడు దాని నిర్వహణకు ప్రభుత్వము డబ్బు మంజూరుచేయు చుండును. కాని సాధారణముగా ఏ గ్రామమునకైతే ఒక బందిలీదొడ్డి వుద్దేశించబడెనో దాని నిర్వహణలోని కష్టనష్టములన్నియు దాని ఆదా యము మీదనే ఆధారపడి యుండవలెనని సూత్రము మాత్రము గ్రహించ బడెను.

పశువుల యొక్క యజమానివచ్చి బందిలీ చేయబడ్డ పశువులను విడుదల చేయుటకు కోరినయెడల వాటి విడుదలకొరకు విధించబడేటి జుల్మానాలు, ఖర్చులు చెల్లించిన మీదట అవి విడుదల చేయబడును. ఆ విధముగా విడుదల చేయబడిన పశువులకు సక్రమమైన రశీదు ఇవ్వవలెను. ఎట్టి కారణముచేత నైనను బందిలీ చేయబడిన పశువులు బందిలీ తేదీ నుండి వారములోజులలో విడుదలకు కోరబడని యెడల ఈ విషయము దగ్గరగా యుండెడి పోలీసు అధికారికి తెలియపరచబడవలెను. పై విధముగా రిపోర్టుచేసిన మీదట బహిరంగ స్థలములో అట్టి పోలీసు అధికారి అమ్మదలచుకొనిన పశువుల యొక్క వర్ణన, పట్టుబడిన స్థలము, అమ్మబడే ప్రదేశము తెలియపర్చుచూ, ఒక నోటీసు అతికించి అదే విషయమును టాంటాం చేయించును. ఈ విధముగా ప్రకటన చేసిన ఏడు రోజుల లోపలకూడా ఎవ్వరూవచ్చి పశువులను విడుదలకు కోరని యెడల వాటిని నిర్ణయించబడిన స్థలములలో అదే కాలమునకు అమ్ముదురు. ఈ అమ్మకములో మేజిస్ట్రేటు వుద్దేశ్యములో ఎట్టి పశువుకైనను సరియైన ధర ఇంకొక చోటగాని, ఇంకొక విధముగా గాని అమ్మిన వచ్చునని తోచిన అతను ఆ విధముగా ఆదేశించవచ్చును. ఇట్టి సందర్భములలో పశువుల యజమానివచ్చి పశువులు అన్యాయముగా పట్టుకొనబడినవని ఆరోపించుచూ, వాటికి కట్టవలసిన పైకము చెల్లించిన, వాటిని అతనికి స్వాధీనము చేయవలెను, అతనికి చట్టములో 20 వ నిబంధన ప్రకారము మేజిస్ట్రేటువద్ద పట్టుకొనిన వారి మీద ఫిర్యాదు చేసుకొనవచ్చును. అట్టి యజమాని చెల్లించవలసిన పైకము చెల్లించని యెడల విధించబడిన డబ్బుకు సరిపోయెడి పశువులను మాత్రము విక్రయించి అట్టి పైకము చెల్లు పెట్టుకొని ఏదైనా మిగిలిన పైకము, పశువులును, వాటి యజమానికి రశీదు తీసుకొని యివ్వవలెను. ఈ విధముగా వసూలు చేయబడిన పైకములో నుండి మేత మొదలగు ఖర్చులు పశువులదొడ్డి కాపరికిఇచ్చి మిగిలినది జిల్లా మేజిస్ట్రేటుకు పంపును. ఖర్చులకు,జుల్మానాకు సరిపోగా అదనముగాయున్న పైకము 3 మాసములు మాత్రము మేజిస్ట్రేటు వారు డిపాజిటులో నుంచి తరువాత ఎవరైనుకోరి రుజువుచేసి

కొనని పక్షమున ప్రభుత్వాదాయములో కలిపి వేయబడును. ఈ విధముగా అమ్మబడు పశువులను అమ్మెడి అధికార్లుగాని పశుదొడ్ల కాపర్లుగాని కొనకూడదు. ఎట్టి పరిస్థితులలో నైనను పశుదొడ్ల కాపర్లు జిల్లా మేజిస్ట్రేటు యొక్కగాని సరియైన న్యాయస్థానము యొక్కగాని ఆదేశము లేనిదే బందిలీ చేయబడిన పశువులను వదలకూడదు.

---

## 5వ అధ్యాయము

ఈ అధ్యాయములో పశువులను ఎవరైనా గనుక అన్యాయముగా పట్టుకొనిన లేక కట్టివేసిన యెడల ఆ విధముగా కట్టివేసిన 10 రోజుల లోపల జిల్లా మేజిస్ట్రేటుకు ఫిర్యాదు చేయవచ్చును. ఏ కారణముచేత నైనను జిల్లా మేజస్ట్రేటుకు ఫిర్యాదు చేయుటపడని యెడల ఇంకొక పూర్తి అధికారముకలిగిన మేజిస్ట్రేటుకికూడ ఫిర్యాదు చేయవచ్చును. ఫిర్యాదు వ్రాతపూర్వకముగా గాని, మూజబాణీగా గాని వుండవచ్చును.

మూజబాణీగా యున్నపుడు ఆ ఫిర్యాదు సారాంశము మేజిస్ట్రేటు వ్రాసుకొనుట అవసరము. మేజిస్ట్రేటు ఫిర్యాదు సహేతుకమని తోచిన యెడల ప్రతివాదికి నోటీసు యిచ్చి కేసు దర్యాప్తుచేయును. అన్యాయముగా పట్టుకొనిన, నష్టపరిహారము దానితోపాటు ఫిర్యాదీ పశువులను వదలించుకొనుటకు చెల్లించిన ఖర్చులు, జుల్మానాలు కూడ ఇప్పించును. ఏ కారణముచేతనైనను నష్టపరిహారము వెంటనే చెల్లించబడనియెడల అట్టిఫిర్యాదీ వెంటనే పశువులను వదలిబెట్టుచు చెల్లించవలసిన నష్టపరిహారము, ఇతరఖర్చులు తానుగా విధించిన జుల్మానాలుగా పరిగణింపబడి రాబట్టుకొనుటకు అవకాశము గలదు.

---

# 6వ అధ్యాయము

ఈ అధ్యాయములో పశువులను బందిలీచేయుటలో అడ్డుతగిలిన వారికి పట్టుకొనినపిమ్మట వదిలించికొని పోయినవారలకు 6 నెలలవరకు శిక్షవిధించబడగలదు. అదికాక, పశువులను విచ్చలవిడిగా వదిలినవారలకు దానివలన కొంతఅలజడి కలిగించినకూడా యజమానులు, వాటిమీద తాత్కాలికపు హక్కు కలిగినవారలుకూడా శిక్షార్హులు. ఇదేవిధముగా పందులను విచ్చలవిడిగా వదలెడివారుకూడా శిక్షకు పాత్రులగుదురు. పశువుల యజమానులు, యితరులు ఏవిధముగా శిక్షకర్హులగుదురో 24, 25, 26, 27 నిబంధనలలో చెప్పబడినవి. 27వ నిబంధనలో పశుదొడ్ల కాపర్లు వారికి నిర్ణయించబడిన విధులను సక్రమముగా నిర్వహించని యెడల వారలుకూడా శిక్షకు బాధ్యులగుదురు. బందిలీదొడ్ల కాపర్లజుల్మానాలు మాత్రము వారి జీతములనుండి మినహాయింపబడును. ఈవిధముగా వసూలుకాబడిన జుల్మానాలు మేజిస్ట్రేటుకు న్యాయసమ్మతమని తోచిన నష్టమునకుగాని చెడిపోయిన వాటినిగాని పరిహారముగా జమకట్టబడును.

---

# 7, 8వ అధ్యాయములు

7వ అధ్యాయంలో పశువులను అన్యాయముగా కట్టివేయుటచేత నష్టపడినవ్యక్తులు మేజిస్ట్రేటు కోర్టుద్వారా వారు నష్టపరిహారము కోరని యెడల, కోరినను అది సహేతుకముగా లేదని తోచినయెడల సివిల్ కోర్టుద్వారా నష్టపరిహరము కోరుటకు వీలుకలదు. సివిల్‌కోర్టు నష్టపరిహారమిచ్చునపుడు మేజిస్ట్రేటు కోర్టులోనిచ్చిన నష్టపరిహారము మినహాయించి సొమ్ముకు డిక్రీయిచ్చును.

8వ అధ్యాయములో ప్రత్యేకముగా రాష్ట్ర ప్రభుత్వము వాటి అధికారములను వాటి అధికార్లకు బంధిలీ చేయుటకు అర్హతలు

కల్పించబడెను. ఇట్టి అర్హతలు కల్పించినఎడల రాష్ట్రప్రభుత్వ అధికార్లు రాష్ట్రప్రభుత్వము చేయవలసిన విధులను నిర్వహించుటకు వీలుండదు. అథవా చేసినను అవి చట్ట సమ్మతముకావు. అందుకనే ఈ 31 వ నిబంధన ప్రత్యేకముగా చేయబడెను. ఇదికాక రాష్ట్రప్రభుత్వములు ఈ చట్టనిర్వహణకు కావలసిన నియమావళిని తయారుచేసుకొను అధికారముకూడ ఈయబడెను. దీనిని పురస్కరించుకొని రాష్ట్రప్రభుత్వము నియమావళిని తయారుచేసి మామూలుప్రకారముగా శాసనసభ ఆమోదమును పొందును. ఆమోదము పొందిన పిదప ప్రభుత్వ గెజెట్ లో ప్రచురించును. ఈ అధ్యాయములో 32 వ నిబంధన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు వారి 1959 వ సంవత్సరపు 16వ సవరణ చట్టము ద్వారా చేయబడెను.

పంచాయితీ సమితులు, జిల్లా పరిషత్తులు ఏర్పడిన పిమ్మట పరిపాలనా వికేంద్రీకరణములో బందిలీ దొడ్ల నిర్వహణకూడా ఒకటిగా గ్రామ పంచాయితీలకు, పంచాయితీ సమితులకు ఎవరు నిర్వహించతలచుకొనిన వారలకు అప్పచెప్పుటకు రాష్ట్రప్రభుత్వము సమ్మతముగాయున్నది. ఈ విధముగా కొన్ని పంచాయితీలకు అప్పుడేవీటి నిర్వహణ బాధ్యత అప్పగించడమైనది. అది తెలంగాణా జిల్లాలలో ఎక్కువగా తహసీల్ దారుచేత అప్పగించబడినది.

---

## 1వ అధ్యాయము

### ఆరంభము :

1. పేరు, మరియు విస్తృతి :- ఈ చట్టము 1871 వ సంవత్సరపు హద్దుమీరెడి పశువుల చట్టము అని పిలువబడవలెను. మరియు

2. ఈచట్టము, [హైదరబాదు సికింద్రాబాదునగరములు, మినహాయించి 1956 వ రాష్ట్రవిభజన చట్టము (1956 పు 37 కేంద్ర చట్టము) 3వ సెక్షను (1) పసబ్ సెక్షనులో ఉదహరించిన భాగము కాకుండా] 1956 నవంబరు 1వ తేదీకి మున్ముందుగా 'బి' తరగతి రాష్ట్రములోని ఇతర భాగములకుతప్ప; మరియు రాష్ట్రముఖ్యపట్టణములు, రాష్ట్రప్రభుత్వముచేత తడవతడవకు అధికార పూర్వమైన గెజెట్ ప్రకటన ద్వారా మినహాయించు యితరస్థానిక భాగములకు తప్ప, మిగతామొత్తం హిందూదేశమునకు వర్తించబడును.

ష రా॥ ఆంధ్రప్రదేశ్ 1959 వ సంవత్సరపు XVIవ చట్టప్రకారము. ఈ సవరణతో ఆంధ్రప్రదేశ్‌కు వర్తింపచేయుట అయినది. ఈ చట్టము 1959 జనవరి 30 వ తారీఖున ఆంధ్రప్రదేశ్ గవర్నరుగారి సమ్మతి పొంది, 12 ఫిబ్రవరి 1959 న ఆంధ్రప్రదేశ్ గెజెట్ IV. (బి) భాగములో 11 వ పుట యందు ప్రచురింపబడెను. ఈ చట్టముయొక్క పూర్తి పాఠము చివర ఈయబడెను.

3. నిర్వచనములు : ఈ చట్టములో :

(ఎ) "పోలీసు అధికారి" అనగా గ్రామ కాపరి మరియు పోలీసు పటేలు, లేక స్థానికముగా పోలీసు పటేలుపని నిర్వహించు ఏ యితర వ్యక్తి అయినను, మరియు;

(బి) "పశువులు"లో ఏనుగులు, ఒంటెలు, బఱ్ఱెలు, దున్నపోతులు, గుఱ్ఱములు, పొట్టి గుర్రములు, ఈ జాతికి చెందిన కొల్టులు, ఫిల్లీలు అనబడు జంతువులు, కంచర గాడిదలు; గాడిదలు; పందులు, పొటేళ్ళు, ఆడగొఱ్ఱెలు, గొఱ్ఱెలు, గొఱ్ఱెపిల్లలు, మేకలు, మేకపిల్లలు,

(సి) "స్థానిక అధికారి"అనగా, నిర్ణీత స్థానిక ప్రదేశమునకు, ఏ విషయములకైనను చట్ట రీత్యా పరిపాలన, అధికారము, తాత్కాలికముగానైనను ఈయబడిన వ్యక్తుల సంస్థ; మరియు.

(డి) "స్థానిక నిధి" అనగా, ఒక స్థానిక సంస్థల నిర్వహణ, అధికారము క్రింద యుండే ఒక నిధి.

---

## 2వ అధ్యాయము

పశువుల దొడ్లు మరియు పశువులదొడ్ల కాపరులు:

4. పశువుల దొడ్ల ఏర్పాటు :- జిల్లా మేజిస్ట్రేటు తడవ తడవకు, నిర్ణయించు స్థలములలో పశువుల దొడ్లను ఏర్పాటు చేయబడవలెను. కాని యిది రాష్ట్ర ప్రభుత్వము యొక్క సాధారణ అజమాయిషీకి లోబడి యుండవలెను.

ప్రతి పశువుల దొడ్డియున్నూ ఏ గ్రామముచేత ఉపయోగింపబడవలెనో, అది జిల్లా మేజిస్ట్రేటు నిర్ణయించవలెను.

5. పశువులదొడ్ల యొక్క అజమాయిషి, బందిలీచేయబడిన పశువులను మేపుటకు అగు ఖర్చుల ధరలు:- పశువులదొడ్లు, ఆ జిల్లా మేజిస్ట్రేటు యొక్క అధికారము క్రింద యుండవలెను, మరియు, ఆయన, బందిలీ చేయబడిన పశువులను మేపుటకొరకు నీళ్ళు పెట్టుటకు అయే ఖర్చుల ధరలను, నిర్ణయించవలెను లేక తడవతడవకు మార్పు చేయవచ్చును.

6. పశువులదొడ్ల కాపరుల యొక్క నియామకము :- ప్రతి పశువుల దొడ్డికిని ఒక పశువుల కాపరిని రాష్ట్ర ప్రభుత్వము నియమించవలెను,

పశువులదొడ్ల కాపరులు యితర ఉద్యోగములు చేయవచ్చును :-

ఏ పశువులదొడ్ల కాపరి అయినను, ఒకే కాలములో ప్రభుత్వము క్రింద ఏ యితర ఉద్యోగమునయినను చేయవచ్చును,

పశువుల దొడ్లకాపరి 'ప్రభుత్వోద్యోగి' అయియుండుట :- ప్రతి పశువుల దొడ్ల కాపరియున్నూ ఇండియా శిక్షాస్మృతి (1860 వ సంవత్సరపు X L Vవ చట్టము) యొక్క అర్థము ప్రకారము. ప్రభుత్వోద్యోగిగా ఎంచుకొనబడవలెను.

పశువుల దొడ్లకాపర్లు యొక్క విధులు:

7. రిజిష్టర్లు వ్రాయుట; వివరములనుపంపుట :- ప్రతి పశువులదొడ్ల కాపరియున్ను రాష్ట్ర ప్రభుత్వము తడవతడవకు ఆదేశించు ప్రకారము రిజిష్టర్లను వ్రాయుచు, కావలసినట్టి వివరములను పంపుచు ఉండవలెను.

8. పట్టుకొన్నవాటిని రిజిష్టరులో నమోదు చేయుట :- పశువుల దొడ్డికి పశువులను తీసుకొని వచ్చినప్పుడు, పశువులదొడ్డి కాపరి తన రిజిష్టరులో ఈ క్రింది విషయములు వ్రాసు కొనవలెను:-

(ఎ) జంతువుల సంఖ్య, దాని వర్ణన.

(బి) ఏ రోజున, ఏ గంటలో, ఎక్కడ నుంచి అది అట్లా పట్టుకుని వచ్చినది.

(సి) పట్టుకొనిన వాని పేరు, కాపుర స్థలము.

(డి) తెలిసియున్న ఎడల, సొంతదారుని పేరు, వూరు.

9. పశువులను జాగ్రత్త చేయుట, వాటిని మేపుట :- పశువుల దొడ్లకాపరి, ఈ తరువాత చెప్పబడిన విధముగా పశువులను వదుల్చుకునే వరకు, పశువులను జాగ్రత్తపరచి, నీరుపట్టి, మేత పెట్టవలెను.

---

## 3వ అధ్యాయము

పశువులను బందిలీచేయుటకు పట్టుకొనుట :

10. భూములను పాడుచేయు పశువులు :- ఏ భూమిలోనైనను లేక దానిలో ఏ భాగములోనైనను అక్రమముగా హద్దుమీరి వచ్చినను, అట్టి భూమిని పాడుచేయుచున్నను, లేక, దానిలోయుండే పంటకుగాని, ఫలసాయమునకుగాని హాని కల్గించుచున్నను, అట్టి భూమి యొక్క వ్యవసాయదారుడుగాని, ఆ భూమిని ఆక్రమణదారుడుగాని, లేక అట్టి భూమిలో పంట పండించుటకుగాని, లేక ఏ యితర ఫలసాయమును పెంచుటకైనా డబ్బు ఖర్చు పెట్టినవారు కాని, అట్టి భూమిలోగాని, లేక దానిలో కొంత భాగములోని పంట లేక ఫలసాయమును కొనుగోలు దారుడుగాని, తనఖాదారుడుగాని ఏ పశువులనైనను పట్టుకొనవచ్చును లేక పట్టించవచ్చును. ఆ విధముగా పట్టుకున్నవాటిని 24 గంటలలోపల, భూమి ఏ గ్రామమునకు చెందునో ఆ గ్రామముకొరకు ఏర్పాటు చేయబడిన పశువులదొడ్డికి పంపవలెను లేక పంపించవలెను.

పోలీసులు వాటిని పట్టుకొనుటలో సహాయము చేయుట:-

పోలీసు అధికారులు అందరూ, వాటిని (ఎ) పట్టుకొనుటలో ఆటంకపర్చునప్పుడు, (బి) ఆ విధముగా పట్టుకొనెడి మనుష్యుల నుండి విడిపించునప్పుడు, సహాయము కోరినప్పుడు తప్పక చేయవలెను.

11. రహదార్లను, కాల్వలను. కాలవగట్లను, పాడుచేయు పశువులు :- రహదార్లు, విహారస్థలములు, తోటలు, కాల్వలు, మురుగు పారుదల పనులు కాల్వగట్లు. మొదలగువాని విషయములు చూచు వ్యక్తులుగాని, పోలీసు అధికారులుగాని, ఏవైన పశువులు, అట్టి రోడ్లకు, స్థలములకు, తోటలకు, కాల్వలకు, మురుగుపారుదల పనులకు కాల్వగట్లకు, మొదలగు వాటికి గాని, అట్టి రోడ్లు, కాల్వలు, కాల్వగట్లు,

మురుగుపారుదల పనుల యొక్క ప్రక్కలు గాని, గట్లనుగాని, పాడు చేయునప్పుడు, లేక అచ్చట అవి తిరుగుచున్నట్లు కనుగొన బడినప్పుడు, వాటిని పట్టుకొనవచ్చును లేక పట్టించవచ్చును.

ఆ విధముగా పట్టుబడ్డ వాటిని, 24 గంటలలోపల దగ్గరగాయుండే పశువుల దొడ్డికి పంపవలెను.

12. పశువుల దొడ్లలో బందిలీ చేయబడిన పశువులకు జుల్మానాలు:- పై విధముగా బందిలీ చేయబడిన ప్రతి ఒక్క పశువుకు, పశువులదొడ్ల కాపరులు అధికార పూర్వమైన గెజెట్‌లో ప్రకటన ద్వారా రాష్ట్రప్రభుత్వముచేత అప్పటికి నిర్ణయింపబడిన ధరల ప్రకారము జుల్మానాలు విధించవలెను. వివిధ స్థానిక ప్రదేశమునకు వివిధ రకమైన ధరలు నిర్ణయింపబడవచ్చును.

ఆ విధముగా విధింపబడ్డ జుల్మానాలు, రాష్ట్రప్రభుత్వముచేత ఆదేశింపబడే అధికారి ద్వారా ఆ జిల్లా మేజిస్ట్రేటుకు పంపబడవలెను.

ప్రతి పశువులదొడ్డి మీదగాని, లేక దాని దగ్గరగాగాని, పశువులకు విధించు జుల్మానాల, మేత, నీటి ఖర్చుల ధరలజాబితా ప్రదర్శించబడవలెను.

---

## 4వ అధ్యాయము

### పశువులను అప్పచెప్పుట లేక అమ్మకము:

13. పశువులను సొంతదారుడు కోరి జుల్మానాలు ఖర్చులు, చెల్లించినపుడు చేయవలసిన పద్ధతి:-బందిలీ చేయబడిన పశువుల సొంతదారుడుకాని, అతనితరపు మనిషిగాని వచ్చి, పశువులు

అతనివని కోరినప్పుడు, పశువుల దొడ్లకాపరి, ఆపశువులకొరకు ఖర్చు పెట్టబడిన, ఖర్చులు, జుల్మానాలు చెల్లించిన మీదట, వాటిని అతనికి అప్పచెప్పవలెను

సొంతదారుడుకాని, అతనితరపు మనిషిగాని, పశువులను అప్ప చెప్పుకొన్నమీదట, అవి ముట్టినట్లుగా, పశువులకాపరిచేత ఉంచబడిన రిజిష్టరులో సంతకము చేయవలెను.

14. ఒక వారము రోజులలోపల పశువులను ఎవరూ కోరనప్పుడు చేయవలసిన పద్ధతి :-

పశువులను బందిలీచేసిన తేదీనుండి 7 రోజులలోపల అవి కోర బడనిచో, పశువుల దొడ్లకాపరి ఆ విషయమును దగ్గరగా యుండు పోలీసు ఠాణాలోని పోలీసు అధికారికికాని, లేక జిల్లా మేజిస్ట్రేటుచేత దీనికొరకు నియమింపబడెడి అట్టి అధికారికి తెలియబర్చవలెను.

అట్టి అధికారి, దానిమీద, తన ఆఫీసులో బహిరంగముగా కన్పించుచోట ఈక్రిందివిషయములు తెల్పుచు అతికించవలెను :-

(ఎ) పశువులసంఖ్య, దాని వర్ణన,

(బి) ఎట్టిచోట అవి పట్టుబడినవి.

(సి) ఏచోట అవి బందిలీ చేయబడినవి.

మరియు ఆ పశువులు పట్టుబడ్డచోటుకు దగ్గరయుండు బజారు స్థలములలోను, గ్రామములోను సాటింపు ద్వారా పై విషయములు తెలియ చేయించవలెను.

ఆ పశువులు ఆ విధముగా సాటింపు చేయించిన తేదీ నుండి ఏడు రోజులలో కోరబడని ఎడల, అవి, ఆ అధికారిచేతగాని, లేక దీనికొరకు నియోగింపబడిన ఆ కార్యాలయమునకు చెందిన యింకొక ఉద్యోగిచేత

గాని, తదవతదవకు, జిల్లా మేజిస్ట్రేటుచేత అదేశించబడు నియమములకు లోబడి, నియమించిన స్థలములో, నియమించిన కాలమున బహిరంగ వేలములో అమ్మబడవలెను. అయితే ఆ పశువులు, ఆ జిల్లా మేజిస్ట్రేటు యొక్క ఉద్దేశ్యములో ఆ విధముగా అమ్ముటవలన సరియైన ధర రాదు అని తలచిన ఆయనకు ఉచితమని తోచిన పద్ధతి ప్రకారము వాటిని వదిలించవచ్చును.

15. ఖర్చులు చెల్లించుచు, పట్టుకొనుట అన్యాయమని, తగాదాచేయు సొంతదారునికి అప్పచెప్పుట :- సొంతదారుడుకాని, అతని తరపు మనిషిగాని, వచ్చి పట్టుకొనుట అన్యాయమనెడి కారణము చేత జుల్మానాలు, ఖర్చులు చెల్లింప నిరాకరించినప్పుడు, తదుపరి సొంత దారుడు ఈ చట్టము 20వ సెక్షను క్రింద ఫిర్యాదు చేయబోవుచున్నప్పుడు అట్టి పశువులకొరకు అయిన ఖర్చులు, జుల్మానా ధరావత్తుగా చెల్లించిన ఎడల ఆ పశువులను అతనికి వప్పచెప్పవలెను.

16. (1) సొంతదారుడు జుల్మానాలు, ఖర్చులు, చెల్లించుటకు నిరాకరించినప్పుడు గాని, చెల్లించనప్పుడు గాని చేయు పద్ధతి :- సొంతదారుడు కాని, అతని తరపు మనిషిగానివచ్చి, జుల్మానాలు ఖర్చులు చెల్లించుటకు నిరాకరించినప్పుడు గాని, చెల్లించనప్పుడు గాని, 15వ సెక్షనులో చెప్పిన విధముగా ధరావత్తుగా చెల్లించని ఎడల, ఆ పశువులలో అవసరమైనన్నింటిని గాని, లేక మొత్తమునుగాని, 14 వ సెక్షనులో సూచించిన షరతులకు లోబడి, అట్టి అధికారిచేత, నియమిత స్థలములో, నియమిత కాలమున బహిరంగ వేలములో అమ్మబడవలెను.

(2) జుల్మానాలు, ఖర్చులు మినహాయింపు :- ఆ అమ్మకపు డబ్బులోనుంచి, విధింపవలసిన జుల్మానాలు, మేతకు నీరు పెట్టుటకు అయిన ఖర్చులు, అమ్మకమునకు అయిన ఖర్చులతోసహా, మినహా యింపబడవలెను.

(3) అమ్మని పశువులను విడుదల చేయుట; మిగిలిన అమ్మకపు పైకము :- మిగిలిన పశువులను, ఏదైనా మిగిలిన, కొనుగోలు పైకము ఈ క్రింద చూపిన జాబితా ప్రకారం లేఖతోసహా, సొంతదారునికిగాని, అతని తరపు మనిషిగాని వప్పచెప్పబడవలెను.

(ఎ) పట్టుకొనిన మొత్తము పశువుల సంఖ్య.

(బి) ఏ కాలములో అవి బందిలీ చేయబడినదో ఆ కాలము.

(సి) అయినటువంటి ఖర్చులు, జుల్మానాల మొత్తం.

(డి) అమ్మిన పశువుల సంఖ్య.

(ఇ) అమ్మగా వచ్చిన మొత్తం, మరియు,

(యఫ్) ఎట్టి విధముగా ఆ మొత్తమును వాడినది.

(4) రసీదు : అట్టి సొంతదారుడు కాని, అతని తరపు మనిషిగాని, పైనచెప్పిన, జాబితా ప్రకారము అప్పచెప్పిన శేషించిన కొనుగోలు పైకమునకు, పశువులకు రశీదు ఇవ్వవలెను.

17. జుల్మానాలు, ఖర్చులు, మరియు, అమ్మగా హెచ్చుగావచ్చిన పైకము విడుదల :- ఏ అధికారిచేత అమ్మకము జరుపబడెనో ఆ అధికారి ఆ జిల్లా మేజిస్ట్రేటుకు అట్లు మినహాయించిన జుల్మానాలు పంపవలెను.

మేతకొరకు, నీరు పెట్టుటకొరకు 16 వ సెక్షను క్రింద మినహాయించిన పైకము, పశువుల దొడ్లకాపరికి చెల్లించవలెను. అతను 13 వ సెక్షనులో ఖర్చుల క్రింద అట్టి పైకమునంతయు వసూలు పెట్టుకొనవలయును.

మిగిలిన, ఎవరూకోరని పశువుల అమ్మకపు మొత్తమును, ఆ జిల్లా మేజిస్ట్రేటుకు పంపవలెను, ఆయన దానిని మూఢు మాసములపాటు

డిపాజిట్టులో ఉంచవలెను, ఈ కాలములోపల, దానికి ఎట్టి విధముగాను హక్కు చూపి, ధృవపర్చు కొననిఎడల, ఆ మొత్తం రాష్ట్రముయొక్క రాబడి క్రింద పరిగణించబడును.

18. [రద్దు చేయబడెను]

19. (ఎ) అధికార్లుగాని, పశుదొడ్ల కాపరులు గాని, చట్టము క్రింద అమ్మబడు పశువులను కొనరాదు:- ఈ చట్టము నియమముల క్రింద నియమింపబడిన పోలీసు అధికారి గాని, ఇతర అధికారిగాని, పశువులదొడ్ల కాపరిగాని, పరోక్షముగా గాని. అపరోక్షముగా గాని, ఈ చట్టము క్రింద అమ్మబడు ఏ పశువులను కొనరాదు.

(బి) ఎప్పుడు పశువుల దొడ్లకాపరులు బందిలీ చేయబడిన పశువులను వదలకూడదు :- ఒక మేజిస్ట్రేటుచేత గాని, లేక సివిల్ కోర్టుచేత గాని అట్లువదలమని ఆజ్ఞాపించబడినప్పుడు తప్ప, ఏ పశువుల దొడ్లకాపరియు. బందిలీ చేయబడిన పశువులను, ఈ అధ్యాయముయొక్క మొదటి భాగములో చెప్పిన విధమునకు భిన్నముగా వదలి పెట్టకూడదు.

---

## 5 వ అధ్యాయము

### అన్యాయముగా పట్టుకొనుటను గురించిగాని, కట్టివేయుట గురించిగాని ఫిర్యాదులు :

20. ఫిర్యాదులు చేయుటకు అధికారము :- ఏ వ్యక్తి అయినను, తన పశువులు ఈ చట్టము క్రింద పట్టుకొనబడినప్పుడు, లేక అట్లు పట్టుకొనబడి, ఈ చట్టమునకు భిన్నముగా అవి కట్టివేయబడినప్పుడు, పట్టుకొనబడిన తేదీనుండి పది రోజులలో ఎప్పుడైనను,

ఆ జిల్లా మేజిస్ట్రేటుకుగాని లేక, ఆ జిల్లా మేజిస్ట్రేటు ప్రమేయము లేకుండా, ఈ నేరములు విచారణ చేయు అధికారముగల, ఏ ఇతర మేజిస్ట్రేటుకుగాని ఫిర్యాదు చేయవచ్చును.

21. ఫిర్యాదు చేసిన మీదట కర్తవ్యము :- ఫిర్యాదీ స్వయముగాగాని, పరిస్థితులు స్వయముగా తెలిసిన అతని తరఫు మనిషిగాని, ఫిర్యాదు చేయవలెను. ఫిర్యాదు వ్రాతపూర్వకముగాగాని, మూజబాణీగా గాని ఉండవచ్చును. అది మూజబాణీగా అయిన, దానియొక్క సారాంశము మేజిస్ట్రేటుచేత వ్రాతపూర్వకముగా వ్రాయబడవలెను.

మేజిస్ట్రేటుగనుక, ఫిర్యాదీనిగాని, ఆయన తరఫు మనిషినిగాని విచారించిన మీదట, ఫిర్యాదు సహేతుకముగా యున్నట్లు నమ్ముటకు కారణము కన్పించిన, అతను ఎవరిమీదనైతే ఫిర్యాదు చేయబడెనో ఆ వ్యక్తిని పిలిపించి, కేసు దర్యాప్తు చేయవలెను.

22. అన్యాయముగా పట్టుకొనినప్పుడు గాని, కట్టివేసినప్పుడుగాని నష్టపరిహారము :- అట్లు పట్టుకొనుటగాని, కట్టివేయుటగాని అన్యాయము అని తీర్పు తీర్చబడిన ఎడల, మేజిస్ట్రేటు, ఫిర్యాదీకి, పశువులను పట్టుకొన్నటువంటి లేక కట్టివేసినటువంటి వ్యక్తిచేత, ఆ విధముగా పట్టుకొనుటచేత, లేక కట్టివేయుటచేత సంబంధించిన నష్టమునకు, నూరు రూపాయలు మించని సహేతుకమైన పరిహారమును ఇవ్వవలెను, దీనితోబాటు, ఫిర్యాదీ పశువులను వదిలించుకొనుటకు చెల్లించిన ఖర్చులు, జుల్మానాలు కూడా యివ్వవలెను.

మరియు, పశువుల వదలిపెట్టబడకపోయిన, అట్టి నష్టపరిహారమును ఇచ్చుచు, పశువులను వదలుటకు ఉత్తర్వు చేయవలెను; మరియు, ఈ చట్టము క్రింద విధించవలసిన జుల్మానాలు, ఖర్చులు, అట్లు పట్టుకొనిన, లేక కట్టివేసిన వ్యక్తిచే చెల్లించబడవలెనని ఆదేశించవలెను.

23. నష్ట పరిహారము రాబట్టుకొనుట :- నష్ట పరిహారము, 22వ సెక్షనులో చెప్పబడిన జుల్మానాలు, ఖర్చులు, మేజిస్ట్రేటుచేత విధింపబడిన జుల్మానాలుగా పరిగణింపబడి రాబట్టుకొనవచ్చును.

[దీనికి ఆధారముగా ఇండియా శిక్షాస్మృతి (1860 వ సంవత్సరము 45వ చట్టము) మరియు క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ యొక్క 386వ సెక్షను సాధారణ నిబంధనల చట్టము (1897 సంవత్సరపు 10వ చట్టము) యొక్క 25వ సెక్షను కూడా చూడవచ్చును].

---

## 6వ అధ్యాయము

### అపరాధములు :

24. బలవంతముగా పశువులను పట్టుకొనునప్పుడు అటకాయించినందుకు, వదలించినందుకు అపరాధము :- ఎవరివి అయినా బలవంతముగా, ఈ చట్టముక్రింద పట్టుకొనవలసిన పశువులను పట్టుకొనునప్పుడు అటకాయించి, మరియు, ఆ పశువులను పట్టుకొనిన పిదప పశువుల దొడ్డికి, పశువుల దొడ్లనుంచిగాని, దగ్గరగానుండి ఈ చట్టముక్రింద ఈయబడిన అధికారమును పురస్కరించుకొని, పశువుల దొడ్డికి తీసుకొని పోవుచున్న పోబోవుచున్న, ఏ ఇతర వ్యక్తినుండి వదలించినను, మేజిస్ట్రేటు ముందు నేరస్థుడుగా తేల్చినమీదట, 6 నెలలకు మించని ఖైదుచేగాని, 500 రూపాయలు మించని జుల్మానాచేగాని, లేక రెండింటిచేగాని, శిక్షింపబడవలయును.

25. పశువులను హద్దుమీరేటట్లు చేయుట మూలముగా జరిగే అల్లరికి అపరాధము వసూలు :- దీని తరువాత వచ్చే సెక్షను క్రిందగాని, లేక, ఏ భూమిమీదనైనను పశువులను హద్దుమీరేటట్లు

చేయుట మూలముగా జరిగే అల్లరికి విధించిన జుల్మానాను, అట్టి పశువులు, హద్దుమీరి యుండినపుడు పట్టుకొనినను, పట్టుకొనబడక పోయినను అది ఎట్టినేరమునకు శిక్షింపబడిన వ్యక్తియొక్క సొంత ఆస్థి అయినను కాకపోయినను ; లేక అది తాత్కాలికముగా అట్లు హద్దుమీరినప్పుడు అతని అజ్మాయిషీలో మాత్రమే యుండినను ఆ విధముగా హద్దుమీరిన మొత్తము పశువుల లేక కొన్ని పశువుల అమ్మకముచేత రాబట్టుకొనవలెను.

26. పందులవలన భూమికిగాని, పంటలకుగాని, రహదార్లకుగాని, కలిగే నష్టములకు, అపరాధము:- పందుల సొంతదారుడుగాని, కాపలా చేయువాడుగాని, అతనియొక్క నిర్లక్ష్యముచేతగాని ; లేక ఏ యితర విధముగా గాని ఏ భూమినైనను, లేక దానిలోని పంటగాని, ఫలసాయముగాని, ఏ రహదార్లుగాని, అట్టి పందులు వాటిమీద తిరుగునట్లు వదలుటచేత పాడుచేసినను లేక పాడు చేసినట్లు చేయించినను, మేజిస్ట్రేటుచేత నేరస్థుడుగా భావింపబడిన మీదట పది రూపాయలు మించని జుల్మానా విధించబడవలెను.

రాష్ట్రప్రభుత్వము అధికార గెజెట్‌లో ప్రకటనద్వారా తడవ తడవకూ, ప్రకటనలో ఉదహరించిన ఏ స్థానిక ప్రదేశమునైనను, ఈ సెక్షన్‌లో ముందు చెప్పిన భాగము పందులకు బదులు సాధారణముగా, అన్ని పశువులు లేక, ప్రకటనలో తెలియబర్చిన ఒక రకమైన పశువులను "పది రూపాయలు" అనే మాటలకు బదులు "యాభయి రూపాయలు" చేర్చుకొనబడినట్లుగాను, లేక అట్టి రెండు సూచనలు లేక మార్పులు, సూచింప బడినట్లు చదువుకొనవలెనని ఆదేశించవచ్చును.

27. బందిలీ దొడ్లకాపరి విధులు నిర్వహించకపోయిన అపరాధము:- ఏ బందిలీదొడ్డి కాపరియైనను ఈ చట్టముయొక్క 19 వ నిబంధనకు వ్యతిరేకముగా పశువులను వదిలిపెట్టుటగాని, కొనుటగాని

లేక అప్పగించుటగాని లేక బందిలీ చేయబడిన పశువులకు మేత, నీరు ఏర్పాటు చేయకపోయినయెడల, లేక ఈ చట్టముద్వారా అతనిమీద ఆదేశించిన విధులు నిర్వహించకపోయినయెడల అతను బాధ్యుడగు ఎట్టి ఇతర అపరాధము కాకుండా మేజిస్ట్రేటుచేత శిక్షింపబడిన తరువాత 50 రూపాయలకు మించని అపరాధమునకు శిక్షార్హుడు.

అట్టి జుల్మానాలు బందిలీదొడ్డి కాపరియొక్క జీతమునుండి మినహాయింప బడవచ్చును.

28. 25, 26, 27 నిబంధనలక్రింద వసూలుకాబడిననిధి వినియోగము:- 25, 26, 27 నిబంధనలక్రింద వసూలు కాబడిన జుల్మానాలు మొత్తముగాగాని, కొంతవరకూగాని శిక్షవిధించు మేజిస్ట్రేటుగారికి న్యాయ సమ్మతమని తోచిన నష్టములకుగాని చెడిపోయిన వాటికిగాని పరిహారముగా జమకట్టుకొనవచ్చును.

## 7వ అధ్యాయము

28. నష్ట పరిహారమునకు దావావేసుకొనే హక్కు:- ఏ వ్యక్తి అయినను అతని భూమిలోని పంటగాని, ఇతర ఫలసాయము గాని, పశువులు హద్దుమీరితిరుగాడుటచే నష్టపరుపబడినయెడల సక్రమమైన సివిల్ కోర్టులో నష్టపరిహారమునకు దావాచేసికొనుటకు దీనిలోని ఏ నిబంధనలు అడ్డురావు.

30. మినహాయింపు:- ఏ వ్యక్తి అయినను ఈ చట్టముక్రింద శిక్షను విధించు మేజిస్ట్రేటుచేత నష్టపరిహారము చెల్లించబడనియెడల అట్టి సొమ్ము దరిమిలా వేయు దావాలోనుండి, లేక యివ్వబడు నష్టపరిహారము నుండి మినహాయింపబడవలెను,

# 8వ అధ్యాయము

అనుబంధము :

31. రాష్ట్రప్రభుత్వమునకు కొన్ని అధికారములు స్థానిక పరిపాలకులకు బదిలీచేయుటకు అధికారము:- రాష్ట్ర ప్రభుత్వము తడవ తడవకు ప్రభుత్వ గెజెట్‌లో ప్రకటనద్వారా

(ఎ) ఏ స్థానిక పరిపాలకులకయినను, ఈ చట్టము వర్తింపబడు రాష్ట్రములోని ఏ భాగములోనైనను అన్నిగాని, లేక కొన్నిగాని, రాష్ట్ర ప్రభుత్వపు విధులు లేక జిల్లా మేజిస్ట్రేటు ఈ చట్టముక్రింద చేయవలసిన విధులు స్థానిక పరిపాలకుల అజమాయిషీకిలోబడి, అట్టి స్థానిక ప్రదేశములలో నిర్వహించుటకు బదిలీచేయవచ్చును.

32. నియమావళి చేయు అధికారము:- (i) రాష్ట్ర ప్రభుత్వము ఆంధ్రప్రదేశ్ గెజెట్‌లో ప్రచురించబడే ప్రకటనద్వారా యీ చట్ట ఉద్దేశ్యములకు నిర్వహణకు నియమావళి చేయవచ్చును.

(ii) ఈ నిబంధనక్రింద చేసిన నియమావళినంతయు అవి చేసిన వెంటనే శాసనసభముందు వుంచబడవలెను. అటుతరువాత అవి క్రమముగా మార్పులుగాని, తీసివేయబడుటగాని, సవరణచేయబడుటగాని, శాసనసభకు తోచినట్లుగా ఏ సభయందు ఉంచబడెనో ఆ సభ ప్రారంభమైన 14 రోజుల లోపల చేయబడవలెను.

---

1959 సం॥ పు హద్దు మీరెడి పశువుల (ఆంధ్రప్రదేశ్ విస్తరణ మరియు సవరణ) చట్టము

[ఈ చట్టము 1959 సం॥ జనవరి 30 వ తారీఖున గవర్నరు గారి అనుమతి పొంది, ఆంధ్రప్రదేశ్ గెజెట్ IV 'బి' భాగములోని 11వ పుట యందు 12 వ ఫిబ్రవరి 1959 న ప్రకటింపబడెను]

1959 సం॥ 16 వ చట్టము:-

1871 సం॥ పు హద్దు మీరెడి పశువుల చట్టమును, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోని కొన్ని భాగములకు విస్తరించుటకు, మరియు దానివి వర్తింపచేయుటలో కొన్ని సవరణలు చేయుటకు ఉద్దేశింపబడిన చట్టము.

1 ) సంక్షిప్తనామము, విస్తృతి, ప్రారంభము :- (1)ఈ చట్టము 1959 సంవత్సరపు హద్దుమీరెడి పశువుల ( ఆంధ్రప్రదేశ్, విస్తరణ, మరియు సవరణ ) చట్టము అని పిలవబడవచ్చును.

2) ఈ చట్టము ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము మొత్తమునకు వర్తించును.

3) ఈ నిబంధన వెంటనే అమలులోనికి రావలెను ; మరి ఈ చట్టముయొక్క మిగతా నిబంధనలు రాష్ట్రప్రభుత్వముచేత, ఆంధ్ర ప్రదేశ్ గెజెట్‌లో ప్రకటనద్వారా నిర్ణయించెడి తేదీనుండి అమలులోనికి రావలెను.

2. నిర్వచనములు:- ఈ చట్టములో సందర్భమునుబట్టి యింకొక విధముగా జెప్పవలసివస్తే తప్ప :-

( ఎ ) " ఆంధ్రప్రదేశము " అనగా 1956 సంవత్సరము నవంబరు 1 టవ తేదీముందుగా, ఆంధ్రరాష్ట్రముగాయున్న ఆంధ్రప్రదేశ్ ప్రాంతములు.

( బి ) " బదిలీచేయబడిన ప్రాంతము " అనగా 1956 సంవత్సర భాషారాష్ట్ర విభాగపుచట్టము ( 1956 సంవత్సరపు 37 వ కేంద్ర చట్టము ) యొక్క 3 వ నిబంధనలోని) (1) టవ ఉపనిబంధనలో చెప్ప బడిన ప్రాంతములు.

3. 1871 సంవత్సర 1 వ కేంద్రచట్టమును, బదిలీచేయ బడిన ప్రాంతములకు విస్తరణ:- 1871 సంవత్సర హద్దుమీరెడి పశు వుల చట్టము ( 1871 సంవత్సరము- 1 వ కేంద్రచట్టము ) ఈ చట్టము ప్రారంభమునకు పూర్వము ఆంధ్ర ప్రాంతములో అమ లులోయున్న తీరుగాను, ( అనగా ఇకనుంచి అసలు చట్టము అని పిలువబడును ). ఈ చట్టముయొక్క 4,5,6 నిబంధనలచే సవరించబడిన విధముగాను, బదిలీ చేయబడిన ప్రాంతములకు విస్తరింపబడి అమలులో యుండవలెను.

4. 1871 సంవత్సర 1 వ చట్టముయొక్క 1 వ నిబంధ నకు సవరణ :- అసలు చట్టముయొక్క 1 వ నిబంధనలోని (2) వ ఉపనిబంధనలో " 1956 నవంబరు 1 వ తేదీకి పూర్వము పార్టు 'బి' రాష్ట్రములో చేరియుండిన అన్ని భాగములు " అను పదములకు తరు వాత (" 1956, భాషా రాష్ట్ర విభాగము చట్టము, 1956 సంవత్సరము- 37 వ కేంద్రచట్టము ) యొక్క 3 వ నిబంధనలోని 1 వ ఉపనిబంధనలో చెప్పబడిన భాగములుతప్ప, మరియు హైద్రాబాదు, సికింద్రాబాదు పట్టణ ములు మినహా " అను పదములను చేర్చుకొనవలెను.

5. 1871 సంవత్సర 1 వ చట్టముయొక్క 3 వ నిబంధ నకు సవరణ:- అసలు చట్టముయొక్క 3 వ నిబంధనలో " పోలీసు అధికారి " అను ప్రయోగములో గ్రామ కాపరికూడా చేరియుండును. మరియు స్థానికముగా పోలీసు పటేల్‌చేయు పనులు నిర్వహించు వ్యక్తి, పోలీసుపటేలు ; గ్రామ కాపరికూడా ఆ నిర్వచనములో చేరియుండునని, చేర్చుకొనవలెను.

6. 1871 సంవత్సర 1 వ కేంద్ర చట్టములో క్రొత్త 32 వ నిబంధన చేర్చుట:- అసలు చట్టములో 31 వ నిబంధన తరువాత, ఈ క్రింది తెలియ చేయబడిన నిబంధన చేర్చబడవలెను. ఏమనగా

32. నియమావళిచేయు అధికారము:- (1) ఈ చట్ట అవసరములు నిర్వహించుటకు, రాష్ట్రప్రభుత్వము ఆంధ్రప్రదేశ్ గెజెట్ లో ప్రకటనద్వారా, నియమావళి చేయవచ్చును.

2) ఈ నిబంధనక్రింద చేయబడిన నియమావళి అంతయు, అవి చేయబడిన పిమ్మట వీలు అయినంతత్వరగా శాసనసభముందు పెట్టబడి, దానిచేత, అవసరమనెడి మార్పులుగాని, తీసివేతలుగాని, సవరణలుగాని, ఏ సమావేశములో అవి ఉంచబడుతవో దాని ముందు పెట్టబడిన రోజులలోపల చేయబడవలెను.

7. ఇబ్బందులను తొలగించుటకు అధికారము :- ఈ చట్టముయొక్క నిబంధనలలోగాని, ఈ చట్టముద్వారా విస్తరింపబడిన అసలు చట్టమును, బదిలీచేయబడిన ప్రాంతములకు అమలు జరుపుటలో ఎట్టి ఇబ్బంది కలిగినను, రాష్ట్రప్రభుత్వము, ఒక ఉత్వర్వుద్వారా, అట్టి ఇబ్బందులను తొలగించుటకు, వారికి అవసరములనియు, మంచిది అనియు తోచునట్టి నిబంధనలుగాని, ఆదేశములుగాని చేయవచ్చును.

8. 1337 ఫ హైద్రాబాదు 5 వ చట్టము రద్దు :- దీని మూలముగా ( హైద్రాబాదు 1337 ఫసలీ 5 వ చట్టము ) అనగా హైద్రాబాదు హద్దుమీరెడి పశువుల చట్టము రద్దుచేయబడెను.

అయితే, ఇట్టిరద్దు, ఆ చట్టముక్రింద యింతకుపూర్వమే సంక్రమించిన, ఏ రకమైన హక్కులుగాని, నిర్వహింపవలసిన బాధ్యతలుగాని, ఆ చట్టముక్రింద తీసుకొనబడిన, ఎట్టి చర్యలుగాని, అట్టి పనులు చేసిన లేక చర్యలు తీసుకొనబడిన తేదీకి ఈ సవరణ చట్టముచే విస్తరింపబడిన, అసలు చట్టపు అధికారముక్రింద చేయబడిన, లేక తీసుకొనబడిన చర్యలుగా పరిగణింపబడవలెను. ఆనాటికి ఈ అసలుచట్టము బదిలీ చేయబడిన ప్రాంతములలో అమలులో యున్నట్లు భావింపవలెను.

## రెండవ భాగము

## మద్రాసు పశువ్యాధుల (నివారణ) చట్టము.

(1866 వ సంవత్సరపు II వ చట్టము)

పూర్వము మద్రాసు రాష్ట్రమునకు మొత్తముగా వర్తించునట్లు 1866 వ సంవత్సరము మార్చి 16 వ తారీఖున ఇది చట్టముగా చేయ బడి, 1866వ సంవత్సరము ఏప్రియల్ 17 వ తారీఖునుండి అమలులోనికి రాబడెను. ఈ చట్టము తరువాత 1879 వ సంవత్సరము 1 వ మద్రాసు చట్టము చేతను; 1914 వ సంవత్సరము 8 వ చట్టముచేతను. 1921 వ సంవత్సరము 3 వ చట్టముచేతను 1955 వ సంవత్సరము 21 వ చట్టము చేతను సవరింప బడినది. ఈ సవరణల ద్వారాను 1874 వ సంవత్సరము 14 వ చట్టము అనగా షెడ్యూళ్ళ జిల్లాల చట్టము 5 వ సెక్షను క్రింద ప్రకటనద్వారా గోదావరి జిల్లా భద్రాచలము, రాకపల్లి తాలూకాలకు విస్తరించబడినది. హద్దు మీరెడి పశువుల చట్ట మునకును ఎక్కువ సన్నిహిత సంబంధముండుటచే ఈ చట్టము కూడా ఈ పుస్తకములో చేర్చబడినది. ఈ చట్టము (1953 వ సంవత్సరము 30 వ కేంద్ర చట్టము) ఆంధ్రరాష్ట్ర చట్టము ప్రకారము అప్పటి ఆంధ్ర రాష్ట్రమునకు వర్తింపచేయబడినది. తదుపరి (1956 వ సంవత్సరము 37 వ కేంద్ర చట్టము) భాషారాష్ట్ర చట్టము 3 వ నిబంధన ప్రకారము ఆంధ్రప్రదేశమునకు వర్తింప చేయబడినది. దీనికి సరియగు హైదరాబాదు చట్టము పూర్వపు తెలంగాణా జిల్లాలలో అమలులో లేని కారణమున ఈ చట్టమే ఆ జిల్లాలకు కూడా వర్తించును. అట్టి కారణముచేత ఈ చట్టము కూడా దీనిలో పొందు పరచుట ఉచితమని తోచి జతపరుచుట అయినది. పశువులకు సంబంధించిన ముఖ్య చట్టములు రెండును ఒకే చోట లభ్యముచేయుటయే ముఖ్యోద్దేశము. ఈ చట్టము ప్రత్యేకముగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రత్యేక చట్టముగా చేయునంత వరకు అమ లులో వుండును.

ఆంధ్రరాష్ట్రములో పశువులలో అంటువ్యాధులు సోకకుండా నివారించుటకు తగినట్టి ఏర్పాట్లు చేయుట అవసరమని తోచుటచే అది చట్టరూపము ద్వారా అరికట్టుట అవసరమని తోచుటచే ఈ క్రింది విధముగా చట్టము చేయబడెను.

(1) ఈ చట్టము రాష్ట్రప్రభుత్వము అవసరమని తోచిన స్థలములకు అవసరమైనంత కాలము వరకు విస్తరింపచేయుట:-

ఈ చట్టము రాష్ట్ర ప్రభుత్వము లేక దాని అధికారములోవున్న రివెన్యూబోర్డుచేత ప్రభుత్వ గెజెట్‌లో ప్రచురణ ద్వారా అవసరమైన కాలమువరకు కొన్ని జిల్లాలకు గాని, కొన్ని జిల్లాలలోని భాగములకు గాని తడవతడవకు ఆచరణలోనికి తీసుకొని రాబడవలెను.

(2) నిర్వచనములు:- ఈ చట్టములోని పదములకు, ఈ చట్టము విషయములో సందర్భములకు భిన్నముగా లేకున్న ఎడల ఈ క్రింది చెప్పబడిన నిర్వచనముల ప్రకారము అర్థము చెప్పుకొనబడవలెను.

(ఎ) 'మేజిస్ట్రేటు' అనుపదము, మేజస్ట్రేటు నిర్వహించు అన్ని అధికారములు లేక కొన్ని అధికారములు నిర్వహించు అందరు వ్యక్తులు అని భావించవలెను.

(బి) 'సంఖ్య' ఎక్కడైతే ఏకవచనము సూచించెడి పదములకు బహువచనము కూడా కలదనియు బహువచనము సూచించిన పదములు ఏకవచనమునకు కూడా వర్తించుననియు గ్రహించవలెను.

(సి) 'లింగము' పుంలింగమును తెలియపరచు పదములలో స్త్రీ లింగము కూడా వర్తించవలెను.

(డి) 'జంతువు' అనగా ఒంటె, దున్నపోతు లేక బర్రె, గుఱ్ఱము, పోనీ గుఱ్ఱము, గాడిదె, ఎద్దు, ఆంబోతు, ఆవు, ఆవుదూడ, గొఱ్ఱె, గొఱ్ఱెపిల్ల, మేక, మేకపిల్ల, కుక్క మరియు పంది.

(3) ఆస్పత్రి బందిలీదొడ్ల ఏర్పాటు:- ఎక్కడైతే ఈ చట్టము పైన చెప్పబడిన రీతిగా వర్తింప చేయబడెనో అట్టిజిల్లాలలోగాని జిల్లాల యొక్క భాగములోగాని, జిల్లా మేజిస్ట్రేటు నిర్ణయించిన ప్రదేశములలో ఆస్పత్రి బందిలీ దొడ్లను ఏర్పాటు చేయవలెను. అట్టి దొడ్లకు కాపర్లను కూడ ఆయనచేత నిర్ణయింపబడవలెను.

షరా :- మద్రాసు పట్టణమునకు కార్పరేషన్ కమిషనర్ ఏర్పాటు చేయవలెనని యున్నది. ( దీనిని ఆంధ్రరాష్ట్ర ముఖ్య పట్టణమునకు వర్తింపచేయ బడితేతప్ప ఆంధ్రరాష్ట్రమునకు వర్తించదు.)

మేజస్ట్రేటుచేత ప్రకటనద్వారా ఏ ఏ గ్రామములచేత ఏ ఆస్పత్రి బందిలీ దొడ్లు వుపయోగించబడవలెనో నిర్ణయించి తెలుపవలెను.

( 4 ) వ్యాధి సోకిన పశువులు యజమాని తెల్పబడుట :- ఏ జిల్లాలోగాని, జిల్లాలలోని భాగములోగాని చట్టముపై జెప్పబడినట్లు వర్తింపచేయ బడెనో అట్టిచోట ఎప్పుడైనను, ఏ జంతువైనను, ఎట్టి అంటువ్యాధిగాని, విషవ్యాధిచేగాని సోకబడినట్లయిన దాని యొక్క యజమానిగాని లేక దాని అధీనములోవున్న వ్యక్తిగాని, ఆ జంతువు వుండేటటువంటి గ్రామమునకుగాని, పట్టణమునకుగాని, నియోగించబడిన ఆస్పత్రి బందిలీదొడ్ల కాపరికి వెంటనే తెలియపర్చ వలసిన బాధ్యత యుండెను.

( 5 ) పశుదొడ్ల కాపరిచేత పరిశీలన:- పైనచెప్పబడినగూర్చి విధముగా సమాచారము చేరిన వెంటనే అట్టి ఆసుపత్రి పశుదొడ్ల కావరి వీలయినంత త్వరగా ఆ జంతువును పరీక్షచేసి చికిత్స కొరకు ఆస్పత్రి బందిలీ దొడ్లలో దానిని వుంచవలసినది లేనిదీ నిర్ణయించవలెను.

( 6 ) ఆస్పత్రి బందిలీ దొడ్డికి మార్చుట :- ఆ పశు దొడ్ల కాపరి కనుక అట్టి జంతువు అంటువ్యాధి కలిగి వున్నట్లు అభిప్రాయపడిన

యెడల, దాని యజమానినిగాని, దాని అధీనము కలిగిన వ్యక్తినిగాని, దానిని ఆస్పత్రి బందిలీ దొడ్డిలో వుంచమని కోరవచ్చును.

(7) అంటువ్యాధి సోకిన పశువులుగల చోట్లను తనిఖీ చేయుట :- ప్రతి ఆస్పత్రి బందిలీ దొడ్డికాపరి లేక ఆ జిల్లా మేజిస్ట్రేటు చేత అనుమతింపబడిన యితర ఏ వ్యక్తిగాని, అతను నియమింపబడిన ప్రదేశములో ఏఏ చోట్ల ఏదైన జంతువుగాని జంతువులుగాని అంటువ్యాధి చేత సోకబడినట్లు అనుమానించి అట్టి ఏ చోటైనను, ఏ ప్రదేశమునైనను తనిఖీ చేయుటకు అధికారముకలిగి యుండవలెను. తదుపరి ఏదైనా జంతువుగాని జంతువులుగాని అంటువ్యాధితో బాధపడుచున్నట్లు అతను అభిప్రాయ పడినయెడల, అట్టి జంతువులయొక్క యజమానిని ఆ ప్రదేశములకు ఏర్పరచబడిన ఆస్పత్రి బందిలీ దొడ్డిలో దానిని వుంచవలసి నదిగా కోర్డు అధికాము కలిగి యుండవలెను.

షరా :- పట్టణములలో ఈ అధికారము కార్పరేషను కమీషనరు ఈయవలెను.

(8) వ్యాధిగ్రస్త జంతువులు వుంచబడిన స్థలములు శుభ్రపరచుట - మేత మొదలగు వానిని శుభ్రపరచుట :- ప్రతి ఆసుపత్రి బందిలీ దొడ్డి కాపరియున్ను లేదా జిల్లా మేజిస్ట్రేటు చేత అనుమతించ బడిన ఏ ఇతర వ్యక్తి అయినను (పట్టణములలో కార్పరేషను కమీషనరుచేత) అతనికి సంబంధించిన ప్రదేశములలో యధోచిత మని తోచిన ఎట్టివిధముగానైనను అంటువ్యాధితో బాధపడుచుండెడి ఏదైనా జంతువుగాని లేక జంతువులుగాని వుంచబడిన లేక వుంచిన ప్రతి చోటును వ్యాధి సోకకుండా శుభ్రపరి పించవలెను. అతని యుద్దేశ్యములో వ్యాధికి కారణమని తోచెడి ఏ మేత అయినను, ఎరువైనను, మాలిన్యమైనను మలమైనను వెంటనే నాశము చేయించ వచ్చును.

(9) మేతఖర్చు, చికిత్సఖర్చు ఎవరు భరించవలెను ? యజమాని తన పశువుకి మేతఖర్చు, చికిత్సకైన మందు ఖర్చులు

ఇచ్చుట కిష్టపడితేతప్ప అంటువ్యాధి సోకిన ప్రతి పశువును ఆస్పత్రి బందిలీదొడ్డి తన ఆధీనములోకి తీసుకొనిన తేదీలగాయతు దానికయే మేత ఖర్చు, చికిత్సకయే మందు ఖర్చులు 1857 వ సంవత్సరపు 3 వ చట్టముక్రింద ఏర్పాటు చేయబడిన పశువుల బందిలీ దొడ్లనిధినుండి ఖర్చుచేయవలెను.

అయితే ఆవిధముగా యజమాని తానంతట తాను యిచ్చు మేత లేక మందు ఆస్పత్రి బందిలీదొడ్ల కాపరికి సమ్మతముగానైనను లేక ఆదేశించిన ప్రకారముగా నైనను వుండవలెను.

10. వ్యాధితో కూడినపశువులను చంపుట కధికారము:- ఆస్పత్రి బందిలీదొడి కాపరి కాని లేక జిల్లామేజిస్ట్రేటుచేత అనుమతింప బడిన (పట్టణములో కార్పరేషను కమీషనరుచేత) వ్యక్తిగాని ఏదైన జంతువు బందిలీదొడ్డిలో వుంచుటకు ముందుగాగాని, వుంచిన తరువాత గాని అంటువ్యాధిని నివారించుటకు ఆ జంతువును చంపుటకు అవసర మని తోచినయెడల దానిని చంపుటకు అధికారము కలిగియుండెను.

చంపిన పశువుల ఖననము చేయుట :- పై విధముగా జంతువును చంపినపుడుకాని లేక బందిలీదొడ్డిలో వుంచబడినపుడు, అది చనిపోయిన దానిని ఆస్పత్రి బందిలీదొడ్డి కాపరి భూమి మట్టమునుండి 6 అడుగులలోతుకు తక్కువ లేకుండా పాతిపెట్టించవలెను, అట్టి సంద ర్భములో ఏదైనా ఖర్చుచేయవలసిన యెడల అది బందిలీదొడ్ల నిధి నుండి ఖర్చుచేయవలెను.

పరిహారముకోరుటకు వీలులేదు :- ఈ నిబంధనలో అనుమ తించిన ప్రకారము ఎదైన నష్టము సంభవించినయెడల దానికి నష్టపరి హారము కోరుటకు వీలులేదు.

11. బాగుపడిన పశువులకు యజమాని ఖర్చులు. చెల్లించుట :- పైవిధముగా బందిలీచేయబడిన ఒక జంతువు అది బాధ

పడుచున్న వ్యాధినుండి బాగుపడినయెడల యజమానికాని దాని ఆధీన ములో వుంచుకొనిన వ్యక్తికాని అస్పత్రి పశుదొడ్ల కాపరికి అట్టిపశువుకు సరిగా అయిన మేతఖర్చు, చికిత్స ఖర్చులు బందిలీదొడ్డి నిధికి జమ కట్టవలెను.

కట్టనియెడల రాబట్టుకొను విధానము :- పై విధముగా చెప్పబడిన ఖర్చులు అతను చెల్లించనియెడల అట్టి జంతువు వేలము ద్వారా అమ్మబడి వచ్చిన మొత్తములోనుండి రావలసినఖర్చులు జమకట్టు కొని, మిగతా పైకము యజమానికిగాని దాని అధీనము కలిగిన ఇంకొక వ్యక్తికిగాని చెల్లింపబడవలెను.

యజమాని ఎట్టిసమయములలో కట్ట నవసరములేదు :- అయితే యజమాని కనుక అట్టి సందర్భములలో దానికి కావలసినమేత మందుల ఖర్చు ఇచ్చుటకు ఒప్పుకొని యున్న యెడల అతను ఎట్టిఖర్చులు కట్టనవసరములేదు.

12. వ్యాధిగ్రస్త పశువులతో కూడియున్న పశువులను ఇంకొకచోటకు మరలించుట నిషేధము :- అస్పత్రి బందిలీదొడ్డి కాపరిచేత అనుమతి పొందిన ఇంకొక వ్యక్తిచేగాని (పట్టణములోకార్పొ రేషను కమీషనరుచేత) ఇవ్వబడిన లైసెన్సు లేకుండా వ్యాధితో బాధ పడుచున్న పశువుతో ఒకే మందలో వుండిగాని, ఒకే కొట్టములో వున్నటువంటిన్ని ఏ ఇతర పశువుకూడా బ్రతికివుండగా ఆ గ్రామ పరి సరములనుదాటి బయటకు ఎవరును తీసుకొని పోకూడదు.

లైసెన్సులు :- ప్రతి లైసెన్సును లిఖిత పూర్వకముగా వుండ వలెను. ఆ లైసెన్సుద్వారాకూడా అట్టిజంతువు ఆవ్యాధిని సాధారణముగా ఇంకొక జంతువులకు సోకుటకు అవకాశములేదు అని అస్పత్రి బందిలీదొడ్డి కాపరికాని దీని కొరకు అనుమతింపబడిన యింకొకవ్యక్తి కాని తృప్తి చెందిన మీదటనే, అట్టిపశువును ఇంకొక పశువుతో కలియు టకు వీలులేనంత దూరముగా వుంచుటకు అనుమతింపబడవలెను.

13. వ్యాధి పశువులను గూర్చి తెలియపరచక పోయిన అపరాధము :- ఏజంతువైనను తన ఆధీనములో వుంచుకొని దానికి అంటువ్యాధి సోకినట్లు తెలిసి 4 వ సెక్షనులో చెప్పబడిన ప్రకారము ఆస్పత్రి పశుదొడ్డి కాపరికి తెలియపరచని యెడల మేజస్ట్రేటుచేత శిక్షకు పాత్రుడగును. శిక్ష ప్రతి తప్పిదమునకు 5 రూపాయలు మించని జరిమానాగాని అదిచెల్లించనియెడల 10 రోజులుమించని ఖైదుగాని అయి వుండును.

14. పశుదొడ్లకాపరి యొక్క ఆదేశమును పాటించని యెడల అపరాధము :- ఏ వ్యక్తిఅయినను ఆస్పత్రి పశుదొడ్ల కాపరి యొక్కగాని లేకజిల్లా మేజస్ట్రేటుచేత అనుమతింపబడిన యింకొకవ్యక్తి యొక్కగాని (పట్టణములలో కార్పరేషను కమీషనరుచేత) ఆదేశించబడిన వాటిని అనగా వ్యాధిగ్రస్తమైన పశువులను బందిలీదొడ్డిలో పెట్టుట, లేక ఎట్టి స్థలమునైనను శుభ్రపరచనియెడల చనిపోయిన పశువులచోటును వ్యాధి శోకకుండా శుభ్రపరచనియెడల మేతను శుభ్రపరచుటగాని, నాశనము చేయనియెడల అదేవిధముగా వ్యాధిని వ్యాపింపచేయు ఎరువునుగాని మాలిన్యమునుగాని నాశనము చేయనియెడల మేజస్ట్రేటుచేత ప్రతి ఒక్క తప్పిదమునకు నేరస్తుడుగా పరిగణింపబడి 20 రూపాయల జుల్మానాకు లేక 10 రోజులు మించని సాధారణ జైలుశిక్ష విధించబడును.

15. బందిలీ దొడ్లలో పెట్టుటకు, లేదా పట్టుకొనుటకు అడ్డుపెట్టిన అపరాధము:- ఏ జిల్లాకుగాని, జిల్లాయొక్క భాగములలోగాని, ఈ చట్టము వర్తింపచేయబడెనో ఆచోట్ల ఆస్పత్రి పశుదొడ్లకాపర్లు, లేక పోలీసు అధికార్లు (సబ్ ఇనస్పెక్టరుకు హోదాకు తగ్గనివారు) లేక జిల్లా మేజస్ట్రేటుచేత ఆదేశించబడిన ఇతర వ్యక్తులుగాని (పట్టణములలో కార్పరేషను కమీషనరుచేత) వ్యాధులచేత బాధపడు పశువులను బలవంతముగా పట్టుకొని బందిలీ చేయుటకు అధికారము కలదు. అట్టి పట్టుకొనుటలో గాని, పట్టుకొనిన తరువాత బలవంతముగా విడిపించినగాని,

ఇండియా శిక్షాస్మృతి 186వ సెక్షను క్రింద నేరము చేసినట్లుగా భావింప బడి శిక్షింపబడుదురు.

16. యజమానిచేత అన్యాయముగా పట్టుకొనినప్పుడు ఫిర్యాదు:- ఏజంతువు యొక్క యజమాని అయినను తనజంతువును (అన్యాయముగా) వ్యాధిగ్రస్తమైనదానిగా పట్టుకొనినప్పుడు దానిని పట్టు కొనిన 10 రోజులలోగా, ఏమేజస్ట్రేటుకయినను, ఫిర్యాదు చేయవచ్చును.

ఫిర్యాదు మూజువాణీగా కూడా ఉండవచ్చును. అట్టి సందర్భము లలో దానిని మేజస్ట్రేటుచేత వ్రాయబడవలెను. లేక సాధారణ కాగితము మీద, ఫిర్యాదు, ఫిర్యాదిచేతగాని, అన్ని సంగతులు తెలిసిన, అతని తాలూకు మనిషిచేతగాని వ్రాసి దాఖలు చేయవలెను.

ఫిర్యాదీనిగాని అతని మనిషినిగాని విచారించిన మీదట, మేజస్ట్రే టుకు ఫిర్యాదు సహేతుకమని తోచిన నిందితుని పిలిపించి, త్వరిత పద్ధతిని కేసు విచారించ వలెను.

పట్టుకొనుట కనుక, అన్యాయము అని, తీర్పు తీర్చిన ఎడల, మేజస్ట్రేటుచేత అట్టి అక్రమముగా పట్టుకొనుట వలన కలిగిన, సమంజస మైన నష్ట పరిహారమును, ఫిర్యాదీకి ఇప్పించవలెను. దానితోబాటు ఆ జంతువును వదలించుకొనుటను, అతను పెట్టబడిన అన్ని ఖర్చులు కూడా ఇస్తూ అట్టి జంతువుల విడుదలకు ఉత్తర్వులు ఈయవలెను. ఈ చట్టముక్రింద కట్టవలసిన అన్ని ఖర్చులు పట్టుకొనిని వ్యక్తిచేత చెల్లింపబడవలెను.

ఈ పరిహార మొత్తం, ఖర్చులు 1859 వ 24 వ చట్టము క్రింద ఆదేశించబడిన పద్ధతి ప్రకారము, వసూలు చేయబడవలెను.

17. జుల్మానాలు. రుసుములు రాష్ట్ర ప్రభుత్వమునకు జమకట్టుట:- ఈ చట్టము క్రింద విధించబడిన జుల్మానాలు, వసూలు చేయబడిన రుసుములు, రాష్ట్ర ప్రభుత్వపు రాబడికి జమకట్టవలెను.

అయితే, ఈ జుల్మానాలు విధించు అధికారి ఈ జుల్మానాల మొత్తంలో సగమునకు మించని మొత్తమును, భోగట్టా తెలియచేసిన వ్యక్తికి ఇచ్చుట యుక్తము.

18. నియమావళి చేయు అధికారము:- రాష్ట్ర ప్రభుత్వమునకు, ప్రభుత్వ గెజెటులో ప్రచురణ ద్వారా, తడవతడవకు, పశువులలో వ్యాధిని బాగా నివారింప చేయుటకై, చేయవలసిన కార్యముకొరకు, నియమావళిని చేయు అధికారము కలిగియుండవలెను. అట్టి నియమావళి ఈ చట్ట నిబంధనలకు వ్యతిరేకముగాగాని, అసందర్భముగాగాని యుండకూడదు.

తప్పిన ఎడల అపరాధము:- అట్టి నియమావళి పాటించుటలో ఏ విధమైన లోపము వచ్చినను, మేజస్ట్రేటుచేత, విచారింపబడి, 10 రూపాయలు మించని జరిమానాగాని, లేక 15 రోజులు మించని ఖైదుగాని, శిక్షగా విధించబడవలెను.



# నియమావళి

## మూడవ భాగము

షరా: నియమావళిలో చెప్పబడిన "ఫారములు" "ఆర్టికిల్సు" ఆంధ్రప్రదేశ్ స్పెషల్ ఫండ్ కోడ్‌లో 4వ అధ్యాయము క్రింద సూచింపబడిన ఫారములు, ఆర్టికెల్సు అని గ్రహించవలెను.

(ఎ) హద్దుమీరెడి పశువుల చట్టము (1871 సం॥ 1వ చట్టము) యొక్క నిబంధల క్రింద చేయబడిన నియమావళి.

1. బందిలీ దొడ్లను ఏర్పాటుచేయుట:- ప్రతి జిల్లా మేజిస్ట్రేటు, రాష్ట్ర ప్రభుత్వముయొక్క సాధారణ అధికారమునకు లోబడి, తడవ తడవకు, నిర్ణయించు స్థలములలో పశువుల దొడ్లను ఏర్పాటు చేయవలెను. అట్టి బందిలీదొడ్డి ఏ గ్రామము లేక గ్రామములకు ఉపయోగింపబడవలెనో అట్టిరీతిగా అతనిచే నిర్ణయించబడవలెను.

2. (ఎ) పశువులను బందిలీ చేయుటకు అధికారము కలిగిన వ్యక్తులు:- ఏ భూమిలోనైనను లేక దానిలో ఏ భాగములోనైనను అక్రమముగా హద్దుమీరి వచ్చినను, అట్టి భూమిని పాడుచేయుచున్నను, లేక దానిలో యుండే పంటకుగాని, ఫలసాయమునకుగాని హాని కల్గించుచున్నను, అట్టి భూమియొక్క వ్యవసాయదారుడుగాని, ఆ భూమి ఆక్రమణదారుడుగాని, లేక ఏ యితర ఫలసాయమును పెంచుటకైనా డబ్బు ఖర్చుపెట్టినవారుకాని, అట్టి భూమిలోగాని, లేక దానిలో కొంత భాగములోని పంట లేక ఫలసాయమును కొనుగోలుదారుగాని, తన ఖాతాదారుడుగాని ఏపశువులనైనను పట్టుకొనవచ్చును లేక పట్టించవచ్చును. ఆ విధముగ పట్టుకొనినవాటిని ఆలస్యము లేకుండా వెంటనే ఆ గ్రామమునకు ఏర్పాటు చేయబడిన పశువుల దొడ్డికి పంపవలెను.

(బి) ప్రభుత్వ సహాయము:- పోలీసు అధికారులు అందరు, గ్రామ అధికారులందరు కోరినమీదట,

(i) పట్టుకొనుటలో ఎవ్వరైనను ఆటంక పరచినపుడును,

(ii) ఆ విధముగా పట్టుకొనెడి మనుష్యులనుండి విడిపించునప్పుడును, తప్పక సహాయము చేయవలెను.

3. పబ్లిక్ స్థలములలో తిరిగెడి పశువులు:- రహదార్లు విహార స్థలములు, తోటలు, కాలువలు, మురుగు కాలువలు, కాలువగట్లు, మొదలగువానిని కాపాడు వ్యక్తులుగాని, పోలీసు అధికారులుగాని ఏవైనా

పశువులు, పై చెప్పబడిన స్థలములు పాడుచేయునప్పుడు, లేక అచ్చట ఆవిటిరుగుచున్నట్లు కనుకొనబడినప్పుడు వాటిని పట్టుకొని, లేక పట్టించి వెంటనే దగ్గరగా యుండే పశువుల దొడ్డికి పంపవలెను.

4. బందిలీ చేయబడిన తరువాత చేయవలసిన విధానము :- ఒక పశువు బందిలీ దొడ్డికి తీసుకొని రాబడినప్పుడు పశువుల దొడ్లకాపరి వెంటనే 29వ నెంబరు ఫారములో మూడు రసీదులు తయారుచేసి, ఒకటి పట్టుకొన్న వ్యక్తికి యివ్వవలెను. మరియు 31వ నెంబరు ఫారము రిజిష్టరులో 1 నుండి 6వ గళ్ళు జాగ్రత్తగాను, శుభ్రముగాను వ్రాయ వలెను. అటుతరువాత అట్టిపశువులను విడుదల చేయువరకు వాటికి సరిగా మేతవేయుట, నీరుపెట్టుట బాధ్యత అతనిదే.

(ఎ) రివెన్యూ డివిజినల్ అధికారులు, తహసిల్‌దార్లు, డిప్యూటి తహసిల్‌దార్లు అకస్మాత్తుగా యీ బందిలీ దొడ్లను తనిఖీ చేసి పశువులు సరిగా మేపబడి సంరక్షింప బడుచున్నట్లు చూడవలెను. అదికాక వారు పశువులకాపరి రశీదు పుస్తకములోను, రిజిష్టర్లలోనూ, సక్రమముగా బందిలీ చేయబడిన పశువుల అన్నింటికి లెక్కలు చూపించినట్లు తనిఖీ చేయవలెను. అట్లు తనిఖీ చేసినట్లుగా రిజిష్టర్లలో సంతకముచేసి తారీఖు కూడ వేయవలెను.

(బి) [ఈ నిబంధన ఉదకమండలము (మదరాసు రాష్ట్రము) మునిసిపాలిటీలో పట్టుబడిన పశువులకు మాత్రము వర్తించును. ఆంధ్ర రాష్ట్రమునకు వర్తించదు. కనుక వ్రాయబడలేదు.

5. జుల్మానాలు : రేట్లు : బందిలీ చేయబడిన ప్రతి పశువునకును, పశువుల దొడ్డికాపరి ఈ క్రింది చూపబడిన రేట్లు ప్రకారము జుల్మా నాలు విధించవలెను.

| వరుస నెంబరు : | జంతువు : | ఆంధ్ర జిల్లాలు : | తెలంగాణా జిల్లాలు : |
|---|---|---|---|
| | | రూ.న.పై | రూ.న.పై |
| (i). | ఏనుగు | 12- 86 | 15- 00 |
| (ii). | ఒంటె | 6- 43 | 7- 50 |
| (iii). | దున్నపోతు లేక బర్రె | 2- 11 | 2- 00 |
| (iv). | గుఱ్ఱములు (ఆడ మొగ) | 1- 06 | 3- 00 |
| (v). | ఎద్దు లేక ఆవు | 1- 06 | 2- 00 |
| (vi). | ఆవు దూడలు లేక కోడెదూవలు | 1- 06 | 2- 00 |
| (vii). | బర్రెదూడలు లేక కోడె దూడలు | 1- 06 | 2- 00 |
| (viii). | పోనీ గుఱ్ఱములు ; కంచర గాడెదలు కోల్టు - షిల్లీ - | 1- 06 | 1- 50 |
| (ix). | గాడిదలు పిల్లలు | 0- 96 | 0- 75 |
| (x). | పందులు పిల్లలు | 0- 96 | 0- 75 |
| (xi). | గొఱ్ఱె - పోతులు | 0- 23 | 1- 00 |
| (xii). | పై వాటి పిల్లలు | 0- 23 | 1- 00 |
| (xiii). | మేక వాటి పిల్లలు | 0- 95 | 1- 00 |

షరా :- ఇవికాక తెలంగాణా జిల్లాలో ప్రస్తుతము అమలులో యున్న ఉత్తర్వుల ప్రకారం పొడుగుమెడలుగల మెట్టప్రదేశపు జాతులకు 0-06 చొ॥ జింక లేక లేడి కి 0-12 నపై చొ॥ కూడా జుల్మానా విధించ బడుచున్నది. కాని, కొత్త చట్టముప్రకారము జింక లేక లేళ్ళకు జుల్మానాలు లేవు. ఏ విధముగా చూచినను పొడుగు ముక్కు జాతులు జంతువు క్రిందరావు. కాని, సమన్వయ పర్చిన చట్టము అమలులోనికి వచ్చునంత

వరకు తెలంగాణాలో ఆ రేట్లు ప్రకారము, ఆంధ్ర జిల్లాలలో ఆంధ్ర రేట్ల ప్రకారము జుల్మానాలు విధించి వసూలు చేయబడవలెను. ఈ విషయములో ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారు రెండు రేట్లకు యుండెడి వ్యత్యాసమును సమన్వయ పర్చి ఒకటే రేటు జుల్మానాలు నిర్ణయింపః నున్నారు.

( 2 ) పైన చెప్పబడిన జుల్మానాలకు తోడు తెలంగాణా జిల్లాలలో ప్రస్తుతము క్రింద తెలియ బర్చిన పట్టీ ప్రకారము రోజు వారి మేత ఖర్చు, అజ్మాయిషీ ఖర్చు విధించబడి, వసూలు చేయబడు చున్నది.

| వరుస నెంబరు : | జంతువుల పేర్లు : | మేత ఖర్చు : | అజిమాయిషీకి |
|---|---|---|---|
| | | రు.న.పై. | రు.న.పై. |
| 1. | ఏనుగు | 2_00 | 0_50 |
| 2. | ఒంటె | 2_00 | 0_50 |
| 3. | దున్నపోతు లేక బఱ్ఱె | 0_37 | 0_12 |
| 4. | గుఱ్ఱములు ( ఆడ, మగ ) | 0_50 | 0_12 |
| 5. | ఎద్దు లేక ఆవు | 0_25 | 0_06 |
| 6. | ఆవుదూడలు లేక కోడెదూడలు | 0_10 | 0_03 |
| 7. | బఱ్ఱెదూడలు దున్నపోతుపిల్లలు | 0_19 | 0_03 |
| 8. | పోనీగుఱ్ఱములు, గంచరగాడిదెలు | 0_25 | 0_06 |
| 9. | గాడిదెలు | 0_12 | 0_03 |
| 10. | పందులు | 0_06 | 0_04 |
| 11. | గొఱ్ఱె, పోట్టేలు వాటిపిల్లలు, మేకలు | 0_62 | 0_06 |
| 12. | పొడుగు ముక్కు బాతులు | 0_06 | 0_04 |
| 13. | జింక లేక లేళ్ళు | 0_06 | 0_04 |

ఆంధ్ర జిల్లాలలో వీటి రేట్లు దీనికి భిన్నముగా యుండవచ్చును. అవి ఇక్కడ ఇవ్వబడలేదు. వీటినికూడా మార్చి తిరిగి నిర్ణయింపబడ గలవు అని విశ్వసించ బడుచున్నది.

(ఎ) ప్రత్యేకపు అదనపురేట్ల ప్రకారము రిజర్వుచేయబడిన అడవుల లోను, కొన్ని పట్టణముల, గ్రామములనుండి ప్రత్యేకముగా నిర్దేశింప బడిన దూరములలో అనగా (నీలగిరి జిల్లా విషయములో ఇది ఆంధ్ర రాష్ట్రమునకు వర్తించదు) తిరుగుపశువులకు విధించబడును. ప్రభుత్వము వారిచే నిర్ణయింపబడు అదనపు రేట్లను తడవ తడవకు స్థానిక అధికార్ల వద్దనుండి దరఖాస్తుల ద్వారా తెలిసికొనవచ్చును.

ఈ నిబంధన ఆంధ్ర రాష్ట్రములోని ఏ పట్టణమునకు అయినను, గ్రామమునకు అయినను ప్రత్యేక ప్రకటనద్వారా వర్తింప చేయవచ్చును.

(బి) 'పశువు'అను నిర్వచనములో లేడిచేర్చబడలేదు. కాబట్టిఅవి జుల్మానాలనుండి తప్పింపబడినవి.

6. మేత ఖర్చులు :–ఈ చట్టము యొక్క 5వ సెక్షన్ ప్రకారము బందిలీ చేయబడిన పశువులకు, మేతకు నీరు పెట్టుటకు అయ్యే ఖర్చులను ఏ రేటు ప్రకారము వసూలు చేయబడవలెనో అట్టి రేటు జిల్లా మేజిస్ట్రేటు చేతనిర్ణయింపబడి దానియొక్క జాబితా బందిలీదొడ్డి వద్ద గాని, దానికి దగ్గరగా యుండే బహిరంగ స్థలములోగాని ప్రదర్శించ బడవలెను. ఇట్టి రేట్లు పశువుల దొడ్లకాపరి, అతనికి అయేఖర్చులను వీటిని మించకుండా యుండేలాగున విధించబడవలెను.

బందిలీ చేయబడిన పశువుల యొక్క స్వంతదారులు వారి పశువులు బందిలీ దొడ్లలో వున్నప్పుడు మేపుటకు వీలులేదు, ఇది పశువులదొడ్ల కాపరిచేయును.

7. జుల్మానాలున్నూ మేతఖర్చులు వసూలుచేయుట :-ఎవరైనా వచ్చి ఏపశువునైనను వదలమని కోరినవెంటనే పశువుల దొడ్లకాపరి అట్టికోరిన వ్యక్తి ఆ పశువుయొక్క స్వంతకారుడు అనికాని లేక ఆతని యొక్క ప్రతినిధి అని గాని సంతృప్తిజెందిన పిమ్మట అట్టివ్యక్తి జిల్లామేజిస్ట్రేటుచేత నిర్ణయించబడిన రేట్లను మించకుండా. ఖర్చుపెట్ట బడిన మేతచార్జీలు చెల్లించినపిమ్మట ఆ పశువును అతనికి అప్ప చెప్పవలెను. అవిధముగా చెల్లించబడిన పైకమునకు 30 వ నెంబరు ఫారములో మూడు రసీదులు తయారుచేసి అందులో ఒకటి వదిలించు కొనిన వ్యక్తికియిచ్చి అట్టి వ్యక్తియొక్క సంతకము అసలు కాపీయొక్క వెనుకభాగమునగాని, 31 వ నెంబరు ఫారము రిజిష్టరులో పశువును విడుదల చేసికొని నట్లుగా సూచింపబడే చోటున సంతకము చేయించుకొన వలెను. అవసరమైన విషయములు రిజిష్టరులో జాగ్రత్తగా పశువుల దొడ్ల కాపరిచేత వ్రాయబడవలెను.

8. జిల్లా మేజిస్ట్రేటులు బందిలీదొడ్లయొక్క వసూళ్ళుకాని, జుల్మా నాలు, రుసుములు మాఫీచేయుటకు అనుమతియిచ్చు అధికారము కలిగి యుండిరి.

9. పోలీసుస్టేషను అధికారి మొదలగు వారియొక్క రిపోర్టు:- బందిలీచేయబడిన ఏ పశువైనను బందిలీ చేయబడిన ఏడు రోజులలోపల విడుదలకు కోరబడని ఎడల పశువులదొడ్ల కాపరి 32 వ నెంబరు ఫారములో 3 రిపోర్టులు తయారుచేసి దానిలో ఒక కాపీని దగ్గరగాయున్నటువంటి పోలీసు స్టేషను అధికారికిగాని, జిల్లా మేజిస్ట్రేటు చేత దీనికొరకు నియమింపబడిన యే ఇతర అధికారికిగాని పంపబడ వలెను. పశువునుమాత్రము వేలముద్వారా అమ్మునంతవరకు పశువుల దొడ్డిలోనే వుంచబడవలెను.

10. 32 వ ఫారములో పశువులదొడ్డి కాపరినుండి రిపోర్టుచేరిన వెంటనే ఆ రిపోర్టును తీసికొనిన అధికారి ఆతని ఆఫీసుయొక్క బహి

రంగస్థలములో ఒక నోటీసును ఈ క్రింద తెలియబరచిన హాంశములతో;

(ఎ) పశువుయొక్క సంఖ్య, వర్ణన,
(బి) అవి ఎక్కడ పట్టుబడినవో తెలుపు స్థలముయొక్క పేరు.
(సి) అవి యే బందిలి దొడ్డిలో వుంచబడినవి,

అంటించవలెను. మరియు, ఆ నోటీసుయొక్క హాంశములు టముకు ద్వారా గ్రామములోను విక్రయశాలలవద్దను పట్టుకొనబడినచోటు నందును ప్రకటింపవలెను.

11. అమ్మకమునకు ముందు హక్కులు తెలియపరచుట: ఎవరైనను పశువును బందిలీదొడ్లనుండి అమ్మకమునకు పశువులను తీసుకొని పోవుటకు ముందుగా హక్కుదారుడనని కోరినయెడల అట్టి వారిని పశువుల దొడ్ల కాపరివద్దకు పంపవలెను కాని అట్టి పశువులు అమ్మకమునకు అప్పగించబడినయెడల వాటికి విధించబడిన జుల్మానాలు, ఇతర ఖర్చులు కట్టిన మీదట విడుదల చేయబడవలెను. పశువులదొడ్ల కాపరివద్ద పశువులను విడుదలకు కోరినయెడల వాటికి నిర్ణయించబడిన జుల్మానా, యితర మేత ఖర్చులతోబాటు 109 వ ఆర్టికలుక్రింద ఖర్చు బడిన మొత్తముతోసహా చెల్లించిన మీదట విడుదల చేయవలెను. పశువుల దొడ్ల కాపరి అట్టి విడుదల విషయమును ఏ అధికారికయితే అంతకు పూర్వము అమ్మకమునకు రిపోర్టు పంపబడెనో అట్టి అధికారికి వెంటనే తెలియబర్చుచు, 32 వ నెంబరు ఫారముయొక్క నకలులో నున్నూ, 31 వ నెంబరు ఫారము రిజిష్టరులోనూ ఈ విషయము వ్రాయవలెను. పశువులయొక్క హక్కును తెలియబరచి చెల్లింపవవసిన పైకము చెల్లించనియెడల 109 వ ఆర్టికల్ లో నిర్దిష్టింపబడిన విధానమును అనుసరించవలెను.

( ఎ ) అమ్మకమునకు వుద్దేశించబడిన పశువులను బందిలీదొడ్డి నుండి అమ్మకపు స్థలమునకు నిర్ణయించబడిన సమయమునకు కొంచెము ముందుగా మాత్రమేతీసుకొని రాబడవలెను.

12. పశువులను వదిలించుకొను విధానము :- నోటీసు జారీచేయబడిన 7 రోజుల లోపల పశువులయొక్క హక్కును ఎవరూ కోరనియెడల అట్టి అధికారిగాని అతని ఆఫీసుకుచెంది దీని కొరకు నియోగింపబడిన యింకొక అధికారిగాని నిర్ణయించబడిన స్థలమువద్ద అట్టి సమయమునకు ; జిల్లా మేజిస్ట్రేటుచేత తడవతడవకు నిర్ణయించబడు జారీచేయబడు సాధారణము లేక ప్రత్యేకపు షరతులకు లోబడి ; బహిరంగ వేలముద్వారా అమ్మబడవలెను. అయితే జిల్లా మేజిస్ట్రేటు యొక్క ఉద్దేశ్యములో అట్టి పశువులలో ఏదైనను పై విధముగా అమ్మినయెడల సరియైన ధర రాబట్టుటకు వీలులేదని తోచినయెడల అతని యిష్టమువచ్చిన పద్ధతి ప్రకారము పరిష్కారము చేయవచ్చును.

13. అమ్మకమునకు నిర్ణయించబడిన కాలపరిమితిలోపల పశువులయొక్క హక్కును కోరబడియు వాటికి విధించబడిన జుల్మానాలు, మేత ఖర్చులు చెల్లించక లేక వదిలపరచనియెడల పైన సూచించబడిన విధముగా బహిరంగము వేలముద్వారా అన్నిగాని అవసరమైనన్నిగాని పశువులు అమ్మబడవలెను. అట్టి క్రయ ధనమునుండి విధించవలసిన జుల్మానాలు, నీటి, మేతఖర్చులు అమ్మకపు ఖర్చులున్న యెడల అవి మినహాయింపబడి మిగిలిన సొమ్మును, మిగిలిన పశువులు ఏమైనావున్న అవియున్నూ స్వంతదారునికిగాని, వాని తరపు మనిషికిగాని లిఖిత పూర్వకపు రశీదుద్వారా అప్పజెప్పవలెను. అట్టి సందర్భములలో ఈ క్రింది నమూనా ప్రకారము లెక్క జాబితా స్వంతదారునకు యివ్వబడవలెను.

( ఎ ) పట్టుకొనిన పశువుల సంఖ్య :

( బి ) అవి బందిలీ చేయబడిన రోజులు :

( సి ) వాటికొరకు ఖర్చుపెట్టబడిన మేతఖర్చు, ఇతరఖర్చులు, జుల్మానాల మొత్తము :

( డి ) అమ్మబడిన పశువులయొక్క సంఖ్య :

( ఇ ) అమ్మగావచ్చిన ధనము :

( ఎఫ్ ) ఆ ధనము పరిష్కరించిన విధానము :

14. అట్టి పశువులకు సరియైన ధర రానియెడల లేక పాట దారులు లేనియెడల ఈ విషయము ఒక రిపోర్టుద్వారా తహసిల్‌దారుకు గాని డిప్యూటీ తహసిల్‌దారుకిగాని తెలియపర్చవలెను. ఆయన వెంటనే ఆ పశువులను ఏ విధముగా పరిష్కారము చేయవలసిన నట్టివుత్తరవులు జిల్లా మేజిస్ట్రేటువద్దనుంచి వెంటనే పొందును.

15. పశువులయొక్క అమ్మకపుసొమ్ము జమకట్టుట : అమ్మకము నిర్వహించిన అధికారిచేత పెట్టబడిన ఖర్చులు మినహాయించు కొని అమ్మగావచ్చిన మిగతా సొమ్మును, 33 వ నెంబరు ఫారములో లెఖ్ఖతోబాటున్నూ, అమ్మకపు జాబితా వున్నయెడల దానితోబాటున్నూ పశువుల దొడ్లకాపరికి అప్పజెప్పబడవలెను. 30 వ నెంబరు ఫారములో చెల్లించిన సొమ్ముకు పశువుల దొడ్ల కాపరినుండి రశీదు మరిచి పోకుండా పొందవలెను. అదే సమయములో పశువులదొడ్ల కాపరి తన 31 వ నెంబరు ఫారము రిజిష్టరులో అవసరమైన విషయములు రశీదు ఇచ్చు నపుడు వ్రాసుకొన వలెను.

16. పశువుల అమ్మకము మొదలగు రిజిష్టరు:- పశువులను అమ్మకమునకు అప్పగింపబడిన అధికారులందరు 34 వ నెం. ఫారములో ఒక రిజిష్టరు వ్రాయుచుండవలెను. దానిలో మొదటి ఆరుకాలములు 32వ నెంబరు ఫారములో పశువుల దొడ్లకాపరి నుండి రిపోర్టు అందిన

వెంటనే పూర్తిచేయవలెను. మిగతా కాలములు పశువులు అమ్మినపిమ్మట కాని ఇతరత్రా పరిష్కరింపబడిన పిమ్మటగాని పూర్తిచేయవలెను. నెలాఖరున 33వ నెంబరు ఫారములో ఈ రిపోర్టు కాపీ ఒకదానిని తాలూకా కచేరీకి పంపవలెను.

17. అన్యాయముగా పట్టుకొనబడినట్లు ఆరోపింపబడిన కేసులలో అనుసరించవలసిన విధానము:- ఏ వ్యక్తి అయినను వారి యొక్క పశువులను పట్టుకొనబడినపుడుగాని, బందిలీ చేయబడినపుడు గాని అట్టి విధముగా పట్టుకొనబడిన, లేక బందిలీ చేయబడిన రోజు లగాయితు 10 రోజుల లోపల (అట్టి పట్టుకొనడము అన్యాయము అని భావించే యెడల) మేజిస్ట్రేటుకి లిఖిత పూర్వకముగా గాని, స్వయముగా గాని ఫిర్యాదు చేయవలెను. ఈ విధముగా ఫిర్యాదు చేసినంత మాత్రము చేత అట్టి స్వంతదారునికి నిర్ణయించబడిన జుల్మానా, యితర ఖర్చులు పశువుల దొడ్లకాపరికిగాని సందర్భానుసారముగా పోలీసు స్టేషను అధికారికి గాని పశువులను వదలగలందులకైన; అవసరము తప్పదు. అట్టి పట్టుకొనుట మేజస్ట్రేటు అక్రమము అని తీర్పుయిచ్చిన యెడల అట్టి పశువులను వదలిపెట్టవలెను. మరియు స్వంతదారునికి చట్టముయొక్క 22వ నిబంధన ప్రకారము నష్టపరిహారము ఇవ్వవలెను. పశువులకైన జుల్మానాలు. ఇతర ఖర్చులు అప్పటికి (స్వంతదారునిచే) చెల్లించబడని యెడల పట్టుకొనిన వ్యక్తినుంచి మేజిస్ట్రేటు విధించిన జుల్మానాగా పరిగణింప బడవలెను.

---

## (బి) పశువులయొక్క వ్యాధినివారణ చట్టము (1866వ II వ చట్టము) క్రింద చేయబడిన నియమావళి

1. వ్యాధిని తెలియబరచుట:- ఎక్కడైతే జిల్లాలోగాని, తాలూకాలలోగాని, గ్రామములలోగాని పై చట్టముయొక్క మూడవ నిబంధన క్రింద మేజిస్ట్రేటుచేత పశువుల ఆసుపత్రి దొడ్లు ఏర్పరచబడి నపుడు ఏ పశువుకైనా అంటువ్యాధి సోకిన యెడల అట్టి పశువుయొక్క యజమానిగాని లేక దానిని అధీనములో వుంచుకొనిన వ్యక్తిగాని వెంటనే ఆ గ్రామములోవుండే పశువుల ఆస్పత్రి దొడ్లకాపరికి తెలియ జేయవలెను.

2. పశువును ఆస్పత్రి దొడ్లకు మార్చుట :- పశువును పరీక్షించిన తరువాత పశువుల ఆస్పత్రి దొడ్లకాపరి అట్టి పశువు అంటు వ్యాధిచే బాధపడుచున్నట్లు అభిప్రాయపడిన దానిని పశువుల ఆస్పత్రి దొడ్లలో చికిత్సకు వుంచవలసినదిగా దాని స్వంతదారుని కోరవలెను. ఆ విధముగా వాటిని తెచ్చి వుంచిన యెడల 29వ నెంబరు ఫారములో ఒక రసీదును ఇవ్వవలెను.

3. వ్యాధిగల పశువులను బందిలీ చేయుటకు అధికారము గల వ్యక్తులు :- ఆస్పత్రి బందిలీదొడ్ల కాపరులు, పోలీసు హేడ్ కాని స్టేబుల్ హోదాకు తగ్గని అందరు పోలీసు అధికారులు. జిల్లా మేజిస్ట్రేటు చేత ప్రత్యేకముగా అధికార మియ్యబడిన ఇతర వ్యక్తులు, అంటువ్యాధితో బాధపడుతున్న అన్ని పశువులను పట్టుకొని బందిలీ దొడ్లకు పంపించు అధికారము గలదు.

4. చికిత్సకు మేతకు ఖర్చులు :- ఆస్పత్రి పశువుల దొడ్ల కాపరి పశువులయొక్క యజమాని, లేక దానిని అధీనములో వుంచు

కొనిన వ్యక్తిగాని దానికి కావలసిన మేత, మందులు సరఫరా చేయుటకు ఇష్టపడితే తప్ప తనవద్ద యున్నటువంటి ధనములోనుంచి మేతకు, చికిత్సకు అయే అన్ని ఖర్చులు కూడా భరించవలెను. యజమానియే మేత, మందులు ఇచ్చే యెడల అవి పశువుల అస్పత్రి దొడ్లకాపరికి సమ్మతమైనవిగా యుండవలెను.

5. పశువులను పరిష్కరించు పద్ధతి :- అంటువ్యాధి వ్యాపన నివారించుట అత్యవసరమని తోచిన యెడల పశువుల ఆస్పత్రి దొడ్ల కాపరి గాని జిల్లా మేజిస్ట్రేటుచేత దీనికొరకు ప్రత్యేకముగా అనుమతింప బడిన ఏ యితర వ్యక్తిగాని వ్యాధిగ్రస్తమైన పశువును బందిలీ దొడ్డికి తెచ్చుటకు ముందుగాని, తరువాతగాని ఏ పశువునైనను చంపివేయుటకు అధికారము కలిగియుండవలెను. పశువుల ఆస్పత్రి దొడ్లకాపరి ఆధీనములో వుండి ఆ విధముగా చంపబడిన లేక చచ్చిన ప్రతి పశువున్నూ భూమి మట్టమునుండి 6 అడుగుల లోతున బందిలీదొడ్ల కాపరిచేత పాతిపెట్ట బడవలెను. అట్టి పశువులకు ఏ విధమైనట్టి నష్టపరిహారము కోరుటకు వీలులేదు. పైన చెప్పబడిన విధముగా బందిలీ చేయబడిన పశువులు (వ్యాధినుండి) కోలుకొనిన పిమ్మట వాటిని యజమానులకుగాని దానిని ఆధీనంలో వుంచుకొన్న వ్యక్తికిగాని, వాటికి సరిగా అయిన మేత, మందు ఖర్చులు చెల్లించిన పిమ్మట అప్పజెప్పబడవలెను. ఆ విధముగా ఖర్చులు చెల్లించనియెడల ఆ పశువును బహిరంగ వేలముద్వారా అమ్మ బడవలెను. అట్లు అమ్మగా వచ్చిన సొమ్మునుంచి ఖర్చులయొక్క సొమ్మును మినహాయించుకొని యజమానికిగాని దానిని ఆధీనములో వుంచిన వ్యక్తికిగాని రశీదు యిచ్చినమీదట చెల్లించబడవలెను.

(i) బందిలీదొడ్డిలో దీనికొరకై వుంచబడిన రశీదు పుస్తకములో యజమానిగాని ఆ పశువు ఎవరి ఆధీనములోవున్నదో ఆవ్యక్తిగాని సంతకముచేసి అతను తిరిగి 30వ నెంబరు ఫారములో పశువుల దొడ్లకాపరి నుండి మేత, మందు ఖర్చులకుతాను చెల్లించిన పైకమునకు రశీదు పొందవలెను. (రశీదులో అవసరమైనమార్పు చేయబడవలెను.)

## సాధారణ నియమావళి

6. రాబడిలోని రకములు:- పశువులదొడ్ల నుండి వచ్చు వసూళ్ళు ముఖ్యముగా నాల్గు రకములుగా నుండును. దానిలో మొదటి మూడు రకములు హద్దుమీరి తిరుగాడెడి పశువుల చట్టము (1871 సం॥ 1వ చట్టము) క్రింద.

(ఎ) తిరుగుబోతు పశువుల మీద వసూలు అయిన జుల్మానాలు.

(బి) మేత కొరకు వసూలయిన ఖర్చులు.

(సి) బందిలీ చేయబడిన పశువుల నుండి అమ్మకపు వసూళ్ళు.

(డి) చిల్లర వసూళ్ళు-అనగా-ఎరువులు పాతసామానులు, చెట్లు మొదలగునవి, వైద్యచికిత్స, రుసుము, మేత ఖర్చులు మొదలైనవి వ్యాధిగ్రస్థ పశువుల నివారణ చట్టముద్వారా వసూలు చేయబడినవి.

### చిల్లర వసూళ్ళు మొదలగునవి

2. ఎరువులు మొదలగునవి అమ్మకపురాబడి :- అన్ని అమ్మకములు ముందుగా నోటీసు ఇవ్వబడి బహిరంగ వేలముద్వారా అమ్మబడవలెను, కొనుగోలు దారులు ఆడిట్ ఆఫీసుకి తరువాత రశీదులుగా పంపించబడే అమ్మకపు జాబితాలు మీద సంతకముగాని, వేలుముద్రలుగాని చేయవలెను. అమ్మిన వస్తువులను తీసుకొని పోయేముందుగా వాటిధర చెల్లింపబడవలెను. కాని దఫాలువారీగా చెల్లింపబడే నిర్ణయమువున్న యెడల ముందుగా చెల్లింప నవసరములేదు.

3. జుల్మానాలు :- పశువులవ్యాధినివారణ చట్టము యొక్క 13వ నిబంధన క్రింద మేజిస్ట్రేటుచేత విధించబడిన అన్ని జుల్మానాలు ప్రభుత్వ ఖజానాకు చెల్లించబడిన మొత్తము యొక్క జాబితాతోబాటు

చెల్లింపబడవలెను. (చట్టము యొక్క 17 వ నిబంధన చూడుము.) ఈ జాబితా కట్టిన సొమ్ముకు ఆధారపు రశీదుగా వుండును.

4. రుసుములు : వ్యాధి నుండి కోలుకొన్న పశువుల కొరకై యజమానుల చేతగాని, దాని ఆధీనములోవున్న వ్యక్తులచేతగాని చెల్లించబడిన మేత, మందు ఖర్చులు (పైన జెప్పబడినవి) ఖర్చులు "చిల్లర వసూళ్ళు" అను హెడ్ క్రింద చెల్లించబడవలెను.

5. నిధి వినియోగము :- జుల్మానాలు, ఇతర వసూళ్ళ మొత్తములు పశువుల దొడ్లకాపరుల జీతములకు శుభ్రపరచెడి వాళ్ళకు, బందిలీదొడ్లు కట్టుటకు, మరమత్తు చేయుటకు, చట్టముయొక్క వుద్దేశ్యము నిర్వహించవలసిన అన్ని కార్యక్రమములకు, శేషించిన ధనమువున్న యెడల ప్రభుత్వపు వుత్తరువుల ననుసరించి ప్రజోపయోగ కార్యములకు వుపయోగించవచ్చును. 43 వ నెంబరు ఫారములో ఏయే ఖర్చులు దేని క్రింద జమకట్టవలసినది విశదముగా ఈయబడినవి.

6. ఉద్యోగులు :- రకములు :- బందిలీదొడ్ల ఆదాయముల నుండి పూర్తిగా చెల్లింపబడవలసిన వుద్యోగములు ఈ క్రింద తెలుపబడినవి :-

(1) పశుదొడ్ల కాపర్లు

(2) కవల్‌గార్లు లేక శుభ్రపరచెడి వారలు.

(3) కొన్ని డిప్యూటీ తహసిల్‌దార్ల కార్యాలయములలో పనిచేసెడి బందిలీదొడ్ల యొక్క గుమాస్తాలు.

7. బందిలీదొడ్ల కాపర్ల నియామకము :- బందిలీ దొడ్ల కాపర్ల యొక్క నియామకమునకు జిల్లా మేజిస్ట్రేటు యొక్క అనుమతి కావలెను. ఈ రాష్ట్రములో బందిలీదొడ్ల కాపర్లు సాధారణముగా గ్రామ మునసబులు, (పటేళ్లు తెలంగాణాలోనూ) వుందురు. ఇతరులు ఆ విధ

ముగా నియమింపబడినపుడు. గ్రామ మునసబులు ఉద్యోగరీత్యా పశుదొడ్ల కాపర్లుగా వుందురు.

(i) పశుదొడ్ల కాపర్లు ఒకే సమయములో ప్రభుత్వము యొక్క ఇతర ఉద్యోగములు నిర్వహించవచ్చును (వారు ఇండియా శిక్షాస్మృతి క్రింద "పబ్లిక్ సర్వెంట్" క్రింద పరిగణింపబడుదురు)

8. సెలవమంజూరు :- శాశ్వతపు పశుదొడ్ల కాపరి శెలవు మీద యున్నపుడు గాని లేక అతను సస్పెన్షన్‌లోవున్నపుడు గాని అతని స్థానములో వేరొకడు నియమింపబడినప్పుడు అస్థానము యొక్క పూర్తి జీతముగాని, పూర్తి కమీషన్ గాని ఇంకొక విధముగా జిల్లా మేజస్ట్రేటు చేత ఆదేశింపబడితే తప్ప, బదులు మనిషికి చెల్లింపబడవలెను.

పశుదొడ్ల కాపర్లను శిక్షించుట :-ఏ పశుదొడ్ల కాపరినైనను స్వతంత్ర హోదా కలిగిన తహసిల్‌దార్లుగాని, డిప్యూటీ తహసిల్‌దార్లు గాని, జిల్లా రెవెన్యూ అధికారి గాని, జుల్మానా వేయవచ్చును, జిల్లా, మేజిస్ట్రేటు జుల్మానా వేయుట, సస్పెండుచేయుట, తొలగించుట చేయ వచ్చును. సస్పెన్డ్ చేయునపుడు, తొలగించునపుడు ఏ కారణములచేత అట్లుచేసినది వ్రాతపూర్వకముగా వ్రాసి ఆ ప్రొసీడింగులు అట్టి పశుదొడ్ల కాపరికి అందచేయవలెను.

10. కవల్‌గార్లు లేక శుభ్రపరచెడి వారల నియామకము, సెలవలు మొదలగునవి :- స్వతంత్ర హోదా కలిన తహసిల్‌దార్లు డిప్యూటీ తహసిల్‌దార్లు కవల్‌గార్లకు లేక శుభ్రపరచెడి వార్లను నియ మించుటలోనూ, శెలవు మంజూరు చేయుటకున్నూ తొలగించుటకున్నూ అధికారము కలిగియుండిరి.

(డి) పశుదొడ్ల కాపర్ల అకౌంట్లు:-

1. అకౌంట్లు పూర్తిచేయుట :-తాలూకా ఆఫీసు వారు నిర్ణ యించిన సరియైన తేదీ నాటికి నెలసరి లెఖ్ఖలు 31 వ ఫారము రిజిష్టరులో

చివరి పద్దు క్రింద అడ్డముగా ఒకగీత గీసి అన్నికాలములలోని పద్దులు కూడి అన్నిటి క్రింద వసూలు కాబడిన మొత్తము కమీషను నిర్ణయించుటకు (అకౌంట్ కోడ్ 131, 132 ఆర్టికిల్స్ ప్రకారము) లెఖ్ఖలు పూర్తి చేయవలెను. అటుపిమ్మట తాలూకా ఆఫీసుకు పంపుటకై 31 వ నెంబరు ఫారము రిజిష్టరు నుండి ఒక సంగ్రహపు జాబితాను క్రిందటి నెల లెఖ్ఖలు పూర్తి చేసిన పిమ్మట నుండి ఈ రోజు వరకు తయారుచేసి కమిషన్ మొత్తములో నుంచి సొమ్ము ఏ విధముగా ఖర్చు పెట్టినది తెలుపుచూ అచ్చు ఫారములో వ్రాసి యోగ్యతా పత్రముపై సంతకము చేయవలెను.

## 12. జీతముల ప్రమాణము :-

(ఎ) పశుదొడ్ల కాపర్లు :- పశుదొడ్ల కాపర్లకు చెల్లించవలసిన కమీషను సాధారణముగా ఆ మాసములో వసూలు కాబడిన జుల్మానాలలో నూటికి 50 శాతముగా వుండునట్లు లెఖ్ఖపెట్టబడవలెను.

[''మాసము'' అనగా రెండు లెఖ్ఖ పదులు పూర్తిచేయు మధ్యకాలము]

కాని ఆ లెఖ్ఖ చూచుట ఈ క్రింది విషయమునకు లోబడియుండవలెను. నెలలోని మొత్తము వసూళ్ళు ఒక రూపాయికన్న తగ్గిన యెడల పశువుల దొడ్ల కాపరి ఆ మొత్తము తీసుకొనవచ్చును. అట్టి పైకము ఒక రూపాయికన్నా ఎక్కువై రెండు రూపాయలు కన్నా తక్కువైన యెడల ఒక్కొక్క పశు దొడ్డికి 5 రూపాయలుకి మించకుండా అట్టి వసూళ్ళలోనుంచి 50 వ శాతము తీసుకొనవచ్చును.

(1) ప్రత్యేక సందర్భములలో జిల్లా మేజిస్ట్రేట్లు సంవత్సరపు వసూళ్ళు సగటున 200 నుండి 400 రూపాయల వరకు వున్నయెడల నెలకు 6 రూపాయలు చొప్పునను 400 రూపాయలు మించిన యెడల నెలకు 7 రూపాయలు చొప్పునను గరిష్ఠ కమీషను ఇవ్వగలరు.

(2) పశుదొడ్ల కాపర్లచేత పశువులు బందిలీ చేయుటకు స్థలము యివ్వబడిన యెడల ఒక రూపాయికి ఎక్కువ మించకుండా మొత్తము వసూళ్ళలో నుండి అదనముగా 25 శాతము పొందవచ్చును.

3. [ఆంధ్రప్రదేశ్ జిల్లాలలోని బందిలీ దొడ్లకుఈనిబంధనవర్తించదు కాబట్టివ్రాయబడలేదు].

3. (బి) తక్కువ తరగతి పనివాండ్లు :– (1) బందిలీ దొడ్లు శుభ్రపరచు, పశువులను సంరక్షించు, తక్కువ తరగతి పనివారల విషయములో కలెక్టర్లు వాళ్లకు జీతము ఇవ్వవలసినది లేనిది నిర్ణయించవలెను. ఏ పక్షములో నైనను వారల కమీషను 2 రూపాయలకు మించని మొత్తము వసూళ్ళలో 15 శాతము దాటకూడదు. వీలయినంత వరకు జీతముగాని కమీషనుగాని ఇవ్వకుండా చూడవలెను. కాని దానికి బదులు ఆ బందిలీదొడ్లలో ప్రోగు అయేటటువంటి ఎరువు అంతయును ఆ పనివానికి జీతముక్రింద అప్పజెప్పవలెను.

(2) కొన్ని జిల్లాలలో శుభ్రపరిచెడి వారలకు రెవిన్యూ బోర్డు యొక్క అనుమతిమీద స్థిరమైన జీతములు ఏర్పాటు చేయబడినవి.

4. ఎరువులు ప్రోగుచేయుట :– బందిలీదొడ్లలో శుభ్రపరిచెడి వారలకు, తక్కువ తరగతి పనివారలకు జీతముగాని, కమీషనుగాని చెల్లించే యెడల పశు దొడ్లకాపరి ఆ ఎరువును ప్రోగుచేసి తడవ తడవకు అమ్మవలెను. లేక ఒక కంట్రాక్టరుకు ప్రోగుచేసికొని తీసుకొని పోవుటకు, కౌలుకు యివ్వవచ్చును. ఎట్టి సందర్భములో నైనను అమ్మకపు జాబితాను కౌలు ఒడంబడికయున్నూ తహసిల్దారుచేతగాని, డిప్యూటీ తహసిల్దారుచేతగాని క్రింద చెప్పబడిన విధముగా ధ్రువపరచబడవలెను.

5. ఎరువు, చెట్లు మొదలగువాటి అమ్మకము :– బందిలీ దొడ్ల ఆవరణలోని ఎరువు, చెట్లయొక్క ఫలసాయము, చెట్లభాగములు, అమ్మవలసి వచ్చినపుడు షుమారు వాటియొక్క విలువను తెలియబరచుచు, ఒక రిపోర్టును పూర్తి అజమాయిషీ కలిగిన తహసిల్దారుకుగాని,

డిప్యూటీ తహసిల్‌దారుకుగాని పంపవలెను. అది అట్టి అధికారి కనక అమ్ముటకు వుత్తరవు యిచ్చినయెడల పశుదొడ్లకాపరి ఆ విషయమును ప్రకటనచేసి అట్లు నిర్ణయింపబడిన రోజున ఆ వస్తువులను బహిరంగ వేలము ద్వారా అమ్మవలెను. అన్ని పాటలు చూపించు అమ్మకపు జాబితా తహసిల్‌దారుకుగాని,డిప్యూటీ తహసిల్‌దారుకుగాని సమ్మతికొరకు పంపవలెను. అది తిరిగివచ్చిన తరువాత ఆ వస్తువులు చివర పాటదారుకి పాట పైకము వసూలుచేసి, అప్పజెప్పవలెను. ఆ విధముగా వసూలైన సొమ్ము ఇతర వసూళ్ళతోబాటు నెలాఖరున ప్రభుత్వ ఖజానాలో జమకట్టబడవలెను.

6. ప్రభుత్వ ఖజానాలో జమ కట్టుట :- 130వ ఆర్టికిల్‌లో చెప్పిన విధానముగా లెక్కపద్దులు పూర్తిచేసిన పిమ్మట 35వ నెంబరు ఫారము చెలానాలు ఖజానాలో చెల్లించవలసిన డబ్బుకొరకు మూడు చెలానాలు తయారుచేసి, నెలసరి లెక్కలతోబాటు రెండు చెలానాలు డబ్బు ఖజానాకు పంపబడవలెను. ఆ విధముగా చెల్లించవలసిన పైకములో మేత ఖర్చుల కొరకు వసూళ్ళు చేసినది మినహా బందిలీదొడ్లలో వసూళ్లయిన మిగతా పైకమంతయు వుంచి వుండవలెను. మేత ఖర్చు వసూళ్ళు మాత్రము ఖజానాకు పంపనవసరములేదు. ప్రభుత్వ ఖజానా అధికారివద్దనుండి పైకము ముట్టినపిమ్మట తిరిగి రాబడిన చెలాను కాపీ సరిగా యున్నట్లు చూచుకొని దానిని తనవద్దవున్న ఇంకొక కాపీకి అంటించబడవలెను.

షరా : ఏ నెలలో నయినను జుల్మానాల వసూళ్లు పశుదొడ్ల కాపరి యొక్క కమీషను, శుభ్రపరచెడివారల జీతములు చెల్లించుటకు సరిగా సరిపోయెడి సందర్భములో, ఇతర విధమైన బందిలీ దొడ్ల వసూళ్ళు ఆ నెలలో వుంటే తప్ప ఖజానాకు పైకము పంపవలసిన చెలాను తయారు చేయనవసరములేదు. 31వ ఫారము రిజిష్టరు సంగ్రహ రిపోర్టు చివర ఈ వసూళ్ళు నియమముల ప్రకారము తనవద్దనే వుంచుకొన బడినవి అని ఒక షరా వ్రాసిన చాలును.

7. చనిపోయిన పశువుల రిపోర్టు :- ఎప్పుడైనా పశువులు బందిలీ దొడ్డిలో చనిపోయిన యెడల వెంటనే తాలూకా కచేరీకి తగు చర్య కొరకు బందిలీదొడ్ల కాపరియొక్క పుస్తకములోని హంశములను సూచించుచు ఒక ప్రత్యేకపు రిపోర్టు పంపబడవలెను. దానిలో చనిపోయిన పశువుల సంఖ్య, తారీఖు కూడా తెలియపరచబడవలెను. మధ్య మధ్య రివిన్యూ ఇన్స్పెక్టరుగాని, డిప్యూటీ తహసిల్ దారుగాని, తహసిల్దారు గాని, బందిలీ దొడ్ల తనిఖీకి వెళ్ళినపుడు పుస్తకములోని వ్రాసిన విషయముల నిజానిజములు, పశువులు చనిపోవుటను గురించిన విషయములను గురించియు, యదార్థము తెలిసికొనవలెను.

8. తాలూకా ఆఫీసులో అకౌంట్లు దాఖలుచేయుట:- ఈ క్రింద తెలియపరచిన అకౌంట్లు, ఇతర పత్రములు ప్రతినెలా తాలూకా ఆఫీసుకు పంపబడవలెను. అవి సకాలములో పంపుటకు అన్ని విధములా ప్రయత్నము చేయబడవలెను. ఆ విధముగా చేయుటలో ఆలశ్యము ఏదైనా అయినచో దానికి సంజాయిషీ 31 వ నెంబరు ఫారములో సంగ్రహముగా తెలియపరచవలెను.

( ఎ ) బందిలీదొడ్ల 31 వ ఫారములో రిజిష్టరు సంగ్రహము (130వ ఆర్టికల్ ప్రకారము.)

( బి ) 29, 30 ఫారములలో నెలమొత్తములో ఇచ్చిన రశీదు నకళ్ళు (100, 103, 111, 115, 118 ఆర్టిల్సుకి ప్రకారము.)

( సి ) ఖజానాలో డబ్బు కట్టిన రెండు చెలానాలు (135 వ ఆర్టికిల్ ప్రకారము.)

( డి ) ఏమైనా అమ్మకపు జాబితాలు వున్న యెడల అవి:- (134 వ ఆర్టికల్ ప్రకారము)

( ఇ ) 32వ ఫారము యొక్క నకళ్ళు, 33 వ ఫారములోని రిపోర్టులు, బందిలీ చేయబడిన పశువులను అమ్మినటువంటి వుద్యోగి నుండి పొందబడిన అమ్మకపు జాబితాతోసహా (111వ ఆర్టికల్ ప్రకారం)

(i) బందిలీదొడ్ల కాపరి ఏదైనా కారణముచేత తనంతటతాను వీలుగా తాలూకా ఆఫీసులో తనకు రావలసిన కమీషను మొదలగునవి తీసుకొనుటకు వీలులేకపోయిన యెడల, 31 వ నెంబరు ఫారములో లిఖితపూర్వకముగా తనయొక్క ప్రతినిధిని పేర్కొనవలెను, అట్టి ప్రతి నిధి, అయన పైకము తీసికొనినప్పుడు అట్లు తీసికొనినట్లు ఒప్పుకొన వలెను.

(ii) పైన జెప్పిన (సి) హంశము అనగా ఖజానాలో డబ్బు కట్టిన రెండు చెలానాలు, అకౌంట్లు పంపినపుడు జమకట్టిన యెడలనే పంపవలెను. (135వ ఆర్టికల్‌లో ష. రా. చూడుము).

9 కమీషను సొమ్ము పంచిపెట్టుట :– ఖజానాలో నుంచి పైకము వచ్చిన వెంటనే లేక 135వ ఆర్టికల్‌కు ఉన్న షరాక్రింద నెలసరి లెక్కలు పంపిన తరువాత ఖజానాకు పంపవలసిన డబ్బు లేనపుడు పశు దొడ్లకాపరి తనకు రావలసిన కమీషను తను తీసుకొనవలెను, మరియు తక్కువ తరగతి పనివాళ్ళకు వారలకు రావలసిన సొమ్ము వారికి పంచి పెట్టి దీనికొరకు వ్రాయబడెడి పుస్తకములో పైకము ముట్టినట్లు వంతకం చేయవలెను. తరువాత నెలకు 31 వ నెంబరు ఫారములో రిజిష్టరు సంగ్రహములో సర్టిఫికేట్ పూర్తిచేయునపుడు సరిగా వచ్చినటువంటి మొత్తమున్ను, పంచిపెట్టిన మొత్తములు మాత్రమే జాగ్రత్తగా వ్రాయ వలెను.

షరా :–గోదావరి జిల్లాలోని నాగూరు భద్రాచలము తాలుకాలలోని బందిల్ దొడ్ల కాపర్లు బందిలీ దొడ్ల వసూళ్ళలో నుంచి వారికి రావలసిన కమీషన్ సొమ్ము, వారు మినహాయించుకొని మిగతాసొమ్ము తాలుకా ఖజానకు పోష్టల్ మనియార్డరుద్వారా చెల్లించుటకు అనుమతింప బడిరి.

10. ఫారములు సరఫరా చేయుట :–బందిలీ దొడ్లకు వుపయోగ మునకు కావలసిన అన్ని పుస్తకములు, రశీదు పుస్తకములు, ఇతర ఫారములు, తాలూకా ఆఫీసునుండి తెప్పించుకొన బడుచుండవలెను. దీని కొరకు 36వ నెంబరు ఫారములో నిలవ అయిపోవుటకు ముందుగా

తాలూకా ఆఫీసుకి జాబితాపెట్టుకొనవలెను. చేతిలోని ఫారములన్నియు పూర్తిగా అయిపోవునంతవరకు వాటిని కోరకుండా వుండుట మానబడవలెను; ఏమనగా క్రొత్తవి సరఫరాచేయుటలో ఏదైనా ఆలస్యమున్న ఎడల రశీదులు చేతితో వ్రాసిఇవ్వవచ్చును. ఈ పద్ధతి ఎంతమాత్రము చెల్లదు. రశీదు పుస్తకములు అయిపోయిన వెంటనే (అనగా రశీదుల యొక్క పూర్వ ప్రతులు మాత్రమే యున్నప్పుడు) అవి రికార్డుకొరకు తాలూకా ఆఫీసుకి పంపబడవలెను.

11. ప్రత్యేక సందర్భములలో మేతచార్జీల కొరకు ప్రభుత్వమును కోరుట :- ఎప్పుడైనను ఒక పశువు బందిలీలో చనిపోయినపుడు లేక బందిలీ చేయబడిన పశువులను అమ్మగా వచ్చిన ధనము, ఖర్చుపెట్టబడిన మేత చార్జీలకు సరిపోని యెడల లేక పశువులను మేజిస్ట్రేటు చేతగాని, సివిల్ కోర్టుచేతగాని చట్టముయొక్క 22వ సెక్షన్ క్రింద 14వ సెక్షను క్రింద జిల్లా మేజిస్ట్రేటు చేత వదలి పెట్టుటకు వుత్తరవులు ఇవ్వబడినపుడు, బందిలీ దొడ్డ కాపరిచేత తహసిల్‌దారుకి అట్టిఖర్చులు చెల్లించుటకు ఒక దరఖాస్తు పెట్టుకొనబడవలెను. అట్టి దరఖాస్తు అందిన పిమ్మట తహసిల్‌దారు విచారించిన పిమ్మట సబ్ డివిషనల్ మేజిస్ట్రేటు యొక్క సొమ్ము చెల్లించుటకుఅనుజ్ఞ పొందవలెను.

12. బందిలీ దొడ్డ నిర్మాణము, మరమత్తు :-బందిలీ దొడ్డి యొక్క నిర్మాణముగాని, మరమత్తుగాని బందిలీదొడ్డకాపరికి అప్పగించబడినపుడు అతను వెంటనే ఆపనిని అంచనాప్రకారము చేయించవలెను. అట్లు చేయించి తనకు రావలసిన సొమ్మును 6వ నెంబరు ఫారములో ఒక బిల్లు పంపుకొనవలెను. అట్టిపనిని ఒక కంట్రాక్టరుకు ఇచ్చినయెడల లేక ప్రభుత్వ శాఖ చేత జరిపించిన యెడల అతను సరియైన పరికరములు వాడబడినట్లున్నూ, తృప్తికరముగా పని జరిగినట్లున్నూ తృప్తి పొందుటకు అజిమాయిషీ చేయవలెను.

# మా ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 1. | హైదరాబాదు గ్రామ పంచాయతీ చట్టము | | రు. 2-00 |
| 2. | పంచాయతీలు - ఎలక్షను రూల్సు | .... | ,, 1-25 |
| 3. | సమితి జిల్లా పరిషత్ చట్టము | .... | ,, 0-90 |
| 4. | డిటో డిటో ఉర్దూ | .... | ,, 1-25 |